Hazrath Abu Bakar Siddique (R)
(Telugu)

ప్రియప్రవక్త (సఅసం) వారి నలుగురు ఆప్త మిత్రులు

**1వ భాగం**

# హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్

**(రజి అల్లాహు అన్హు)**

మూలం

**మౌలానా ఇర్ఫాన్ ఖలీలి**

అనువాదం

**అబ్బాదుల్లా**

మన ప్రియప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

لَوْ كُنْتُ مُتَّخِذًا خَلِيلًا لَاتَّخَذْتُ أَبَا بَكْرٍ خَلِيلًا

(بخاری و مسلم)

"నేనెవరినైనా మిత్రునిగా చేయదలచుకుంటే అబూబకర్ (రజి)నే మిత్రుడిగా చేసుకుంటాను."

(బుఖారి, ముస్లిం)

پیارے نبی صلی اللہ علیہ وسلم
نے فرمایا کہ

"تمہارے لیے میرے، اور میرے ہدایت یافتہ خلفاء کے طریقے پر چلنا ضروری ہے۔"

(ابوداؤد و ترمذی)

"మీరు నేను చూపిన మార్గంలో, సన్మార్గగాములయిన నా ఖలీఫాలు నడచిన మార్గంలోనే నడవండి." (అబూదావూద్, తిర్మిజి)

*అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో*

# హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్

**(రజి అల్లాహు అన్హు)**

## ఖులఫాయె రాషిదీన్

అరబీ భాషలో ఖలీఫా అంటే ప్రతినిధి, వారసుడు, వైస్రాయ్ అని అర్థాలున్నాయి. ఖలీఫా బహువచనం ఖులఫా. రాషిద్ అంటే సన్మార్గంలో నడిచేవాడని అర్థం. రాషిద్ బహువచనం రాషిదీన్. ఖులఫాయె రాషిదీన్ అంటే సన్మార్గగాములయిన ప్రతినిధులు.

దైవప్రవక్త (సఅసం) ఇహలోకం వీడిపోయిన తరువాత ఆయన వారసులుగా నలుగురు అనుచరులు ఖలీఫాలు అయ్యారు. ఆ నలుగురు:

(1) హ్రజత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి)

(2) హ్రజత్ ఉమర్ ఫారూఖ్ (రజి)

(3) హ్రజత్ ఉస్మాన్ గని (రజి)

(4) హ్రజత్ అలీ (రజి)

ఈ నలుగురినే ఖులఫాయె రాషిదీన్ (సన్మార్గగాములైన ఖలీఫాలు) అంటారు. నలుగురు మిత్రులు అని కూడా అంటారు. మన ప్రియప్రవక్త (సఅసం) దైవాభీష్టం ప్రకారం ఇస్లామీయ సామ్రాజ్యాన్ని ఏ విధంగా పరిపాలించారో ఈ నలుగురు ఖలీఫాలు కూడా అదే విధంగా పరిపాలన చేశారు. వారు తమ తరపున ఎలాంటి మార్పులు, చేర్పులు చేయలేదు.

ఈ రోజు నేను మీకు "యారె గార్" (గుహ మిత్రుడు)గా ప్రసిద్ధి చెందిన మొదటి ఖలీఫా హ్రజత్ అబూబకర్ (రజి) గారి జీవిత విశేషాలను గురించి తెలియజేస్తున్నాను. జాగ్రత్తగా చదవండి.

# పేరు - వంశం

హజ్రత్ అబూబకర్ (రజి) గారి అసలు పేరు అబ్దుల్లా. ఆయన కునియత్ (పితృస్వామ్యం) అబూబకర్. బిరుదులు సిద్దీఖ్, అతీఖ్.

వారి నాన్న గారి పేరు ఉస్మాన్. ఆయన కునియత్ అబూఖహాఫా. అమ్మ పేరు సల్మా. ఆమె కునియత్ ఉమ్ముల్ ఖైర్. తాత (తండ్రికి తండ్రి) పేరు ఆమిర్. మరో తాత (అమ్మ తండ్రి) పేరు సఖర్. హజ్రత్ అబూబకర్(రజి) ఖురైష్ తెగలోని ఉపతెగ బనూ తమీమ్‌కు చెందినవారు. మక్కా ప్రజలు తమీమ్ తెగవారిని ఎంతో గౌరవించేవారు. ఆయన వంశావళి ఆరవ సంతతిలో దైవప్రవక్త (సఅసం) వంశంతో కలుస్తుంది. ఈ విధంగా దైవప్రవక్త (స), హజ్రత్ అబూబకర్ (రజి) ఇద్దరూ ఒకే వంశానికి చెందినవారవుతారు.

హజ్రత్ అబూబకర్ (రజి) తల్లిగారు ప్రారంభంలోనే ఇస్లాం స్వీకరించి ముస్లిం అయ్యారు. వారి నాన్నగారు మాత్రం మక్కా విజయం తరువాత ముస్లిం అయ్యారు. ఆయన తొంభై ఏళ్ళ వయస్సులో చనిపోయారు. చివరి రోజుల్లో ఆయన కళ్ళు పాలిపోయి అంధులయిపోయారు.

# పుట్టుక, బాల్యం

హజ్రత్ అబూబకర్ (రజి) క్రీ.శ. 573 జూన్ నెలలో జన్మించారు. ఆయన ప్రియప్రవక్త (సఅసం) కన్నా రెండున్నర సంవత్సరాలు చిన్నవారు. చిన్నప్పటి నుంచే ఆయన దైవప్రవక్త (సఅసం)కు స్నేహితులు. ప్రియప్రవక్త (సఅసం) మాటలు, అలవాట్లు ఆయనకు ఎంతగానో నచ్చేవి. అందుచేత ప్రియప్రవక్త (సఅసం) ఏ పని చేస్తే ఆ పనిని హజ్రత్ అబూ బకర్ (రజి) కూడా చేసేవారు. ప్రియప్రవక్త (సఅసం) ఎల్లప్పుడూ పరిశుభ్రంగా ఉండేవారు. హజ్రత్ అబూబకర్ (రజి) కూడా పరిశుభ్రత పాటించేవారు. ప్రియ ప్రవక్త (సఅసం) చెడు విషయాలకు ఆమడ దూరం ఉండేవారు. హజ్రత్ అబూ బకర్ (రజి) కూడా చెడు విషయాలకు ఎల్లప్పుడూ దూరంగా ఉండేవారు.

మన ప్రియప్రవక్త (సఅసం) ఎంతో బిడియస్తులు. హజ్రత్ అబూబకర్ (రజి) కూడా అశ్లీల విషయాలను అసహ్యించుకునేవారు. దైవప్రవక్త (సఅసం)

ఎల్లప్పుడూ సత్యమే పలికేవారు. హజ్రత్ అబూబకర్ (రజి) కూడా అబద్ధానికి దూరంగా మసలుకునేవారు. దైవప్రవక్త (సఅసం) ఇతరులకు సహం చేస్తుండే వారు. ఎవరి మనస్సునూ నొప్పించేవారు కాదు. హజ్రత్ అబూబకర్ (రజి) కూడా ఎవరి మనస్సూ నొప్పించకుండా ఉండేవారు. పైగా ఇతరులు కష్టాల్లో ఉంటే వారి పట్ల సానుభూతి వెలిబుచ్చేవారు. అవసరమైనప్పుడు వారికి సహాయం కూడా చేసేవారు. హజ్రత్ అబూబకర్ (రజి), మన ప్రియప్రవక్త (సఅసం) ఎల్లప్పుడూ కలిసిమెలిసి తిరుగుతుండే వారు; కలిసిమెలిసి ఆడుకునేవారు.

ఒక్క మాటలో చెప్పాలంటే హజ్రత్ అబూబకర్ (రజి) చిన్ననాటి నుంచే ఎంతో మంచివారుగా, దయార్ద్ర హృదయులుగా, పరోపకారిగా, పెద్దలను గౌరవించే వ్యక్తిగా ఉండేవారు. అందుచేత మక్కా వాసులు ఆయన్ని ఎంతగానో అభిమానించేవారు; గౌరవించేవారు.

## ఒక విచిత్ర సంఘటన

ఆ కాలంలో అరబ్బులంతా విగ్రహాలను పూజించేవారు. మద్యపానం చేసేవారు. జూదం ఆడేవారు. ఇతరుల సొమ్మును స్వాహా చేసేవారు. అయితే హజ్రత్ అబూబకర్ (రజి) మాత్రం ఈ చెడులకు చాలా దూరంగా ఉండేవారు. ఆయన ఇంట్లోని ఒక గదిలో విగ్రహాలు ఉండేవి. ఇంట్లోని వారంతా ఆ విగ్రహాలను పూజించేవారు. కాని హజ్రత్ అబూబకర్ (రజి) వాటి దరిదాపులకు పోయేవారు కాదు. ఈ విషయాన్ని గురించి స్వయంగా ఆయనే ఇలా ఒక విచిత్ర సంఘటన చెప్పారు:

"ఒకసారి మా నాన్నగారు నన్ను విగ్రహాలున్న గదిలోకి తీసికెళ్ళారు. అక్కడ ఒక విగ్రహాన్ని చూపిస్తూ, 'ఈ విగ్రహమే నీ దేవుడు. దీని ముందు సాష్టాంగపడు' అని చెప్పారు. ఈ మాట చెప్పి ఆయన అక్కడ్నుంచి వెళ్ళి పోయారు. నేనా విగ్రహం దగ్గరికెళ్ళి 'నాకు ఆకలిగా ఉంది, అన్నం తెప్పించు' అన్నాను. కాని విగ్రహం మాట్లాడ లేదు. తరువాత 'నాకు బట్టలు కావాలి, తెచ్చివ్వు' అన్నాను మళ్ళీ. దానికీ విగ్రహం నుండి ఎలాంటి సమాధానం రాలేదు. చివరికి నేను ఒక రాయి తీసుకొని 'చూడు, నేనిప్పుడు నిన్ను ఈ రాయితో కొడ్తాను. చేతనైతే నిన్ను నీవు కాపాడుకో' అని చెప్పాను. దానికీ ఆ

విగ్రహం నుండి ఎలాంటి ఉలుకూ పలుకూ లేదు. అప్పుడు నేను ఆ రాయిని దాని తలమీద బలంగా విసరికొట్టాను. దాంతో అది బోర్లా పడిపోయింది. తరువాత నేను అక్కడ్నుంచి బయటికి వచ్చాను."

నిజమే మరి! విగ్రహాలు ఎలాంటి శక్తీ లేనివి. భక్తులకు సహాయం చేయడం అటుంచి, అవి తమకుతామే సహాయం చేసుకోలేవు. అందువల్ల వాటిని పూజించడం వ్యర్థమని తలంచారాయన.

## యువకుడిగా ఆయన వ్యక్తిత్వం

హజ్రత్ అబూబకర్ (రజి) యుక్త వయస్సుకు చేరుకున్నారు. ఆయన మంచితనం, పరోపకార స్వభావం వల్ల ఖురైష్ తెగలోని ప్రతి మనిషీ ఆయన్ని ఎంతగానో అభిమానించేవాడు.

వంశంలో ఎవరైనా హత్య చేయబడితే ఆ వ్యవహారం కూడా హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరికే వచ్చేది. ఆయన ఎంతో నేర్పుగా ఉభయ పక్షాలకు నచ్చజెప్పి వ్యవహారాన్ని పరిష్కరించేవారు. ఈ పరిష్కారాన్ని ఉభయ పక్షాలు అంగీకరించేవి. హంతకుడి బంధువులు సంతోషంగా రక్తపరిహారం చెల్లించేవారు. దాన్ని హజ్రత్ అబూబకర్ (రజి) హతుని బంధువులకు ఇచ్చేసేవారు.

హజ్రత్ అబూబకర్ (రజి) ప్రారంభం నుండే దైవప్రవక్త (సఅసం)కు ప్రియమిత్రునిగా ఉండేవారు. ఇప్పుడు ఆయన దైవప్రవక్త (సఅసం)కు ప్రాణ మిత్రులయిపోయారు. తనకు తోడుగా దైవప్రవక్త (సఅసం) లేకపోతే ఆయన ఒక్కరోజు కూడా ప్రశాంతంగా ఉండేవారు కాదు. ఆయన ఎల్లప్పుడూ ప్రియ ప్రవక్త (సఅసం)ను వెన్నంటి ఉండేవారు. జీవనోపాధి కోసం ఆయన వ్యాపారం చేసేవారు. వ్యాపారంలో అపారమైన లాభాలు రావడంతో కొద్ది కాలంలోనే ఆయన మక్కా ధనికుల్లో ఒకరయిపోయారు. ఆయన మన ప్రియప్రవక్త (సఅసం)తో కలసి అనేక వాణిజ్య పర్యటనలు జరిపారు.

మన ప్రియప్రవక్త (సఅసం) దైవప్రవక్తగా నియమించబడిన తరువాత తన దగ్గరి బంధుమిత్రులకు రహస్యంగా ఇస్లాం సందేశం అందజేయడం ప్రారంభించారు. తన కుటుంబీకుల తరువాత ముందుగా ఆయన హజ్రత్

అబూబకర్ (రజి)కు ఇస్లాం సందేశం అందజేశారు. హ॥జత్ అబూబకర్ (రజి) ఇస్లాం సందేశం వినగానే ఎలాంటి తటపటాయింపు లేకుండా వెంటనే ఇస్లాం స్వీకరించారు. ఇస్లాం స్వీకరించిన స్వేచ్ఛాపరులైన పురుషులలో ఆయనే మొట్టమొదటి వ్యక్తి. అప్పటికి ఆయన వయస్సు ముప్పయి యేడు సంవత్సరాలు మాత్రమే.

## ఇస్లాం ప్రచారం

హ॥జత్ అబూబకర్ (రజి) ఇస్లాం స్వీకరించగానే ఇతరులు కూడా తన లాగానే ఇస్లాం స్వీకరించి దేవుని ప్రియదాసులలో చేరిపోతే బాగుంటుందని భావించారు. ఈ భావన, తపనలే ఆయన్ని ఇస్లాం ప్రచారం కోసం నడుం బిగించేలా చేశాయి.

మొదట ఆయన మక్కా ప్రజలలో రహస్యంగా ధర్మప్రచారం ప్రారంభించారు. ఆయన చేసిన ప్రచారంతో ప్రభావితులయి కొంతమంది ఇస్లాం స్వీకరించి ముస్లింలయిపోయారు. దాంతో ఆయనకు మరికొంత ధైర్యం వచ్చింది. అప్పుడు ఆయన దైవప్రవక్త (సఅసం) అనుమతి తీసుకొని జనసమూహాలలో బహిరంగంగా ప్రచారం చేయడం మొదలెట్టారు. కాని మక్కా బహుదైవారాధకులు శాంతియుతమైన ఈ ప్రచారాన్ని ఎలా సహిస్తారు?

జనసమూహంలో ఆయన ప్రచారం చేయడం ప్రారంభించగానే సత్య తిరస్కారులైన బహుదైవారాధకులు ఒక్కసారిగా ఆయనపై విరుచుకు పడ్డారు. ఆయన్ని ఇష్టమొచ్చినట్లు చితకబాదారు. దాంతో హ॥జత్ అబూబకర్ (రజి) రక్తసిక్తమయి స్పృహతప్పి పడిపోయారు. అప్పుడు అవిశ్వాసులు ఆయన ఇక చనిపోయి ఉంటారని భావించి వెళ్ళిపోయారు.

హ॥జత్ అబూబకర్ (రజి) పరిస్థితి చూసి ఆయన బంధువులకు గుండెలు కరగిపోయాయి. వారు వెంటనే ఆయన్ని మోసుకెళ్ళి ఇంటికి చేర్చారు. స్పృహరాగానే ఆయన నోట వెలువడిన మొదటి మాటేమిటో తెలుసా? "దైవప్రవక్త (సఅసం) ఎలా ఉన్నారు? నన్ను ఆయన దగ్గరకు తీసికెళ్ళండి" అన్నారు ఆయన. చూశారా, దైవప్రవక్త (సఅసం) పట్ల ఆయనకు ఎంత ప్రేమాభిమానాలు ఉన్నాయో!

## ధర్మప్రచారం పట్ల తపన

హ|జత్ అబూబకర్ (రజి)కు ధర్మప్రచారం పట్ల ఎంతో తపన ఉండేది. ఎల్లప్పుడూ దాన్ని గురించే ఆయన ఆలోచిస్తుండేవారు. గాయాలు కాస్త మాని పోగానే ఆయన మళ్ళీ ధర్మప్రచారం ప్రారంభించారు.

''సోదరులారా! కాస్త ప్రశాంతంగా ఆలోచించండి. ముహమ్మద్ (సఅసం) ఇంతవరకు ఏ విషయంలో కూడా అబద్ధమాడినట్లు మీరు విన లేదు. అలాంటి మనిషి ఇప్పుడు హఠాత్తుగా దేవుని విషయంలో ఎలా అబద్ధమాడగలరు? స్వయంగా మనమే ఆయనకు సత్యసంధుడు, నిజాయితీ పరుడని బిరుదులు ఇచ్చి ఉన్నాం. ఆయన చెప్పే విషయాలన్నీ మన మంచి కోసమే. ఆయన మనల్ని భయంకరమైన నరకాగ్ని నుండి రక్షించదలిచారు. అదీగాక ఈ పని కోసం ఆయన మన నుండి ఎలాంటి ప్రతిఫలం ఆశించడం లేదు. ఆయన మన శ్రేయోభిలాషి. మనకు, యావత్తు విశ్వానికి సృష్టికర్త, స్వామి, ప్రభువు, యజమాని అల్లాహ్ మాత్రమేనని, ఆయనే మనకు ఉపాధి ఇస్తున్నాడని, చివరికి మనమంతా కర్మవిచారణ కోసం ఒక రోజు ఆయన దగ్గరికే పోవలసి ఉందని మనకు హితోపదేశం చేస్తున్నారు. అంతేగా!

మనం మన స్వహస్తాలతో తయారుచేసుకున్న ఈ విగ్రహాలు మనకు ఎలాంటి లాభ నష్టాలు కలిగించలేవు. అలాంటి విగ్రహాలను పూజించడం వృథా ప్రయాస తప్ప మరేమీ కాలేదు. మనం దైవప్రవక్త (సఅసం) బోధించి నట్లు, దేవుని అభీష్టం, ఆయన ఆజ్ఞల ప్రకారం మనుగడ సాగించాలి.''

హ|జత్ అబూబకర్ (రజి) ఈ విధంగా ప్రజలలో ధర్మప్రచారం చేయసాగారు.

## ఆయన ద్వారా ఇస్లాం స్వీకరించినవారు

హ|జత్ అబూబకర్ (రజి) చెబుతున్న మధురమైన మాటలు ప్రజల హృదయాలలో క్రమంగా చోటు చేసుకోసాగాయి. వారు తమ ప్రస్తుత పరిస్థితి గురించి ఆలోచించడం మొదలెట్టారు. ఇలా ఆలోచించినవారిలో సహృద యులు, వివేచనాపరులు హ|జత్ అబూబకర్ (రజి) ముందు ఇస్లాం స్వీకరించి ముస్లింలయి పోయారు. వారిలో ముఖ్యులు:

హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజి)
హజ్రత్ జుబైర్ బిన్ అవ్వామ్ (రజి)
హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి)
హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి)
హజ్రత్ తల్హా బిన్ అబ్దుల్లా (రజి)
హజ్రత్ ఉస్మాన్ బిన్ మత్ఊన్ (రజి)
హజ్రత్ అబూ ఉబైదా బిన్ జర్రాహ్ (రజి)
హజ్రత్ అబూ సల్మా (రజి)
హజ్రత్ ఖాలిద్ బిన్ సయీద్ బిన్ ఆస్ (రజి)

ధర్మ ప్రచారం కోసం దైవప్రవక్త (సఅసం)కు కావలసిన పైకమంతా హజ్రత్ అబూబకర్ (రజి) సమకూర్చేవారు. తన దగ్గరున్న సిరిసంపదలన్నీ దేవుడు ప్రసాదించినవేనని ఆయనకు బాగా తెలుసు. వాటిని దైవమార్గంలో ఖర్చుపెట్టినప్పుడే అవి సద్వినియోగమవుతాయి. అందుకే హజ్రత్ అబూబకర్ (రజి) ధర్మసంస్థాపనా కార్యాల్లో తన సంపదను వెనుకా ముందూ ఆలోచించ కుండా ఖర్చుపెట్టేవారు.

## బానిసలకు స్వేచ్ఛ

బానిసలలో కూడా అనేక మంది ఇస్లాం స్వీకరించారు. ఈ కారణంగా వారి అవిశ్వాస యజమానులు వారిని శరీరం గగుర్పొడిచే విధంగా చిత్ర హింసలు పెట్టేవారు. హజ్రత్ అబూబకర్ (రజి) బానిసలకు ఎదురైన దుస్థితి చూసి సహించలేకపోయారు. ఆయన ఆ బానిసల యజమానులతో మాట్లాడి వారు అడిగినంత పైకం చెల్లించారు. ఈ విధంగా ఆయన బానిసలను కొని వారికి స్వేచ్ఛ ప్రసాదించారు. ఆయన స్వేచ్ఛ ప్రసాదించిన బానిసలలో ముఖ్యులు వీరు:

హజ్రత్ బిలాల్ (రజి)
హజ్రత్ నజీరా (రజి)
హజ్రత్ బిన్త్ నహ్దియా (రజి)
హజ్రత్ ఆమిర్ బిన్ ఫుహైరా (రజి)
హజ్రత్ జారియా (రజి)

## అబిసీనియా వలస

హజ్రత్ అబూబకర్ (రజి) తమ ఇంటి ఆవరణలో ఒక మసీదు నిర్మించుకొని అందులోనే ప్రార్థన చేస్తుండేవారు. అదీగాక ఆయన అక్కడ దివ్యఖుర్‌ఆన్‌ని బిగ్గరగా, శ్రావ్యంగా పఠించేవారు. ఆ సుమధుర పఠనం వినగానే అనేక మంది ఎంతో ప్రభావితులయ్యేవారు. అయితే ఇస్లాం వ్యతిరేక శక్తులు దాన్ని ఎలా సహిస్తారు? వారు హజ్రత్ అబూబకర్ (రజి)ని వేధించడం మొదలెట్టారు. దాంతో ఆయన గత్యంతరంలేక ప్రియప్రవక్త (సఅసం) అనుమతి తీసుకొని అబిసీనియా వలసపోవడానికి బయలుదేరారు.

దారిలో మక్కా అగ్రనాయకుల్లో ఒకడయిన ఇబ్నె దగ్నా ఎదురయి "అబూబకర్! ఎక్కడికి వెళ్తున్నావు?" అని అడిగాడు. హజ్రత్ అబూబకర్ (రజి) తనకు ఇస్లాం వ్యతిరేకశక్తులు పెట్టిన బాధలను గురించి తెలియజేశారు. అప్పుడు ఇబ్నె దగ్నా ఆయనకు రక్షణ హామీ ఇచ్చి మక్కా పట్టణానికి మళ్ళీ పిలుచుకొని వచ్చారు. అయితే అవిశ్వాసులు తెచ్చిన వత్తిడి వల్ల 'మీరు ఖుర్‌ఆన్ పఠనం మాత్రం బిగ్గరగా చేయకండని' చెప్పాడు. హజ్రత్ అబూబకర్ (రజి) అప్పట్లో దానికి అంగీకరించారు. కాని కొన్నాళ్ళ తరువాత మళ్ళీ బిగ్గరగా ఖుర్‌ఆన్ పఠించడం ప్రారంభించారు. దానికి ఇబ్నె దగ్నా అభ్యంతరం చెప్పాడు. ఇద్దరి మధ్య మాటా మాటా పెరిగింది. చివరికి హజ్రత్ అబూబకర్ (రజి) విసుగుచెంది, "నీవు ఇచ్చిన రక్షణ కంటే నాకు దేవుని రక్షణే చాలు. నన్ను నా మానాన వదిలెయ్యి" అన్నారు. చూశారా! హజ్రత్ అబూబకర్ (రజి) కష్టాలు సహించడానికి ఇష్టపడ్డారు కాని, ఖుర్‌ఆన్‌ని బిగ్గరగా చదవకూడదన్న షరతుని మాత్రం ఒప్పుకోలేదు.

## సత్య ధృవీకరణ

ఆ కాలంలోనే ఓ రోజు రాత్రి దేవుడు తన ప్రవక్త (సఅసం)కు సప్తాకాశ పర్యటన చేయించాడు. ఈ పర్యటనలో మన ప్రియప్రవక్త (సఅసం) మక్కా నుంచి వందల మైళ్ళ దూరంలో ఉన్న బైతుల్ మఖ్దిస్ (జెరూసలేం)లోని అఖ్సా మసీదులో నమాజు చేశారు. స్వర్గ నరకాలు చూశారు. దేవునితో ప్రత్యక్షంగా సంభాషించారు. ఈ దివ్య పర్యటననే 'మేరాజ్' అంటారు.

మరునాడు ఉదయం దైవప్రవక్త (సఅసం) కాబా గృహానికి వెళ్ళి తన ఆకాశపర్యటన గురించి ప్రజలకు తెలియజేశారు. దాంతో జనంలో పెద్ద కలకలం బయలుదేరింది. ఖురైష్ నాయకులు ఆయన్ని ఎగతాళి చేయడం మొదలెట్టారు. అబూజహల్ పరుగుపరుగున హ్రజత్ అబూబకర్ (రజి) ఇంటికి వెళ్ళి ఇలా అన్నాడు: "అబూబకర్! విన్నావా ఈ సంగతి? మీ మనిషి ఈరోజు మరో కొత్త విషయం లేవదీశాడు. ఆయనగారి దేవుడు ఆయన్ని రాత్రికి రాత్రే బైతుల్‌మఖ్దిస్ పర్యటన చేయించాడట! అంతేకాదు, సప్తాకాశాల పర్యటన కూడా చేయించాడట!! అలా అని జనంతో చెప్పుకుంటున్నాడు. కట్టుకథలు చెప్పడంలో హద్దుమీరి పోయాడు. అసలతని మెదడుకు ఏమయిందీ?"

అబూజహల్ చెప్పిన తీరు విని హ్రజత్ అబూబకర్ (రజి)కు కోపం వచ్చింది. ఆయన వెంటనే "దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారంటే అది ముమ్మాటికీ నిజం. ఆయన ఈనాటి వరకు అబద్ధమాడి ఎరుగరు. ఈ కారణం గానే మనమంతా ఆయన్ని "సాదిఖ్" (సత్యసంధుడు) అని పిలుస్తున్నాం" అన్నారు ఆవేశంగా.

ఈ సమాధానం విని అబూజహల్ నోరు మూసుకున్నాడు. జావగారిన ముఖంతో వచ్చిన దారే వెళ్ళిపోయాడు.

ఆ తరువాత హ్రజత్ అబూబకర్ (రజి) నేరుగా కాబా గృహానికి వెళ్ళారు. అక్కడ దైవప్రవక్త (సఅసం) ఓ చోట కూర్చొని ఉన్నారు. ఆయన చుట్టూ జనం మూగి ఆయన్ని ఎగతాళి చేస్తున్నారు.

హ్రజత్ అబూబకర్ (రజి) రాగానే, "ఆగండి" అన్నారు. జనమంతా ఒక్కసారిగా ఆయన వైపు దృష్టి సారించారు. "నేను బైతుల్ మఖ్దిస్‌ని చూశాను. దైవప్రవక్తా! చెప్పండి, దానికి ఎన్ని ద్వారాలు ఉన్నాయి, ఏ ద్వారం ఎటువైపు ఉంది వగైరా విషయాలు వివరంగా చెప్పండి" అన్నారు హ్రజత్ అబూబకర్ (రజి). దైవప్రవక్త (సఅసం) బైతుల్ మఖ్దిస్‌ని గురించి వివరంగా తెలియజేశారు.

అప్పుడు హ్రజత్ అబూబకర్ (రజి), "సోదరులారా! దైవప్రవక్త (సఅసం) చెప్పిన విషయాలు పూర్తిగా నిజం. అందులో ఎలాంటి అనుమానం లేదు" అన్నారు బిగ్గరగా.

ఈ మాటలు విని సత్యతిరస్కారులు మళ్ళీ నిరాశ చెందారు. మారు మాట్లాడకుండా అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయారు. హ్రజత్ అబూబకర్ (రజి) చేసిన ప్రకటన విని దైవప్రవక్త (సఅసం) ఎంతో సంతోషించారు. తక్షణమే ఆయనకు "సిద్దీఖ్" అనే బిరుదు ప్రదానం చేశారు. ఆ రోజు నుంచి ఆయన్ని ముస్లింలు అబూబకర్ సిద్దీఖ్ అని పిలవడం ప్రారంభించారు.

## దైవప్రవక్త (సఅసం) మీద అభిమానం

హ్రజత్ అబూబకర్ (రజి), దైవప్రవక్త (సఅసం)ను ఎంతగానో అభి మానించేవారు. ఆయన కోసం తన ప్రాణాలనయినా ధారపోయడానికి సిద్ధంగా ఉండేవారు.

ఒకసారి జరిగిన సంఘటన. మన ప్రియప్రవక్త (సఅసం) కాబా గృహంలో నమాజ్ చేస్తున్నారు. అంతలో అవిశ్వాసుల గుంపొకటి అక్కడికి చేరుకుంది. దైవప్రవక్త (సఅసం) నమాజ్ చేయడం చూడగానే వారు మండి పడ్డారు. వారిలో ఒకడు ముందుకొచ్చి దైవప్రవక్త (సఅసం) మెడలో ఒక కండువా వేసి లాగడం మొదలెట్టాడు. దాంతో దైవప్రవక్త (సఅసం) ఊపిరాడక ఎంతో బాధపడసాగారు. మిగిలిన అవిశ్వాసులు ఆ దృశ్యం చూసి తెగ సంబర పడిపోతూ వెకిలి నవ్వులు నవ్వసాగారు.

కాకతాళీయంగా ఈ సంగతి హ్రజత్ అబూబకర్ (రజి)కు తెలిసింది. ఆ సమయంలో ఆయన ఏదో పనిలో ఉన్నారు. ఈ సంగతి తెలియగానే చేస్తున్న పనిని వదిలేసి ఆయన కాబా గృహం వైపు పరుగెత్తారు. అక్కడికి వెళ్ళి చూస్తే అఖ్బా అనే దుర్మార్గుడు ప్రియప్రవక్త (సఅసం) మెడలో కండువా వేసి ఇంకా లాగుతూనే ఉన్నాడు.

హ్రజత్ అబూబకర్ (రజి) ఒక్క ఉదుటున వెళ్ళి ఆ దుర్మార్గుడ్ని అవతలకు నెట్టి ప్రియప్రవక్త (సఅసం) మెడకు చుట్టిన కండువా తీసివేశారు. ఆ వెనువెంటనే ఆయన ప్రియప్రవక్త (సఅసం)ను తీసుకొని అక్కడ్నుంచి వెళ్ళిపోయారు. సత్యతిరస్కారులు మాత్రం రుసరుసలాడుతూ చూస్తూ ఉండిపోయారు.

# అసామాన్య తెగింపు

అలాంటిదే మరో సంఘటన. హ్రజత్ అలీ (రజి) ఇలా తెలియజేస్తున్నారు: ఒక రోజు నేను కాబా గృహానికి వెళ్ళాను. చూస్తే అక్కడ దైవప్రవక్త (సఅసం) కూడా ఉన్నారు. కొందరు ఖురైషీయులు ఆయన (సఅసం) చుట్టూ గుమి గూడి ఆయన్ని వేధించసాగారు. వారిలో ఒకడు ఆయన (సఅసం) చొక్కా పట్టుకొని బలవంతంగా లాగుతున్నాడు. మరొకడు ఆయన (సఅసం) మెడ మీద చేయివేసి నెడుతున్నాడు. ఈ విధంగా ఆ దుర్మార్గులు దైవప్రవక్త (సఅసం)ను వేధిస్తూ, "నువ్వే కదూ, మా దేవతలను తిరస్కరించి వాటిని దూషిస్తున్నది?" అని అంటున్నారు.

హ్రజత్ అలీ (రజి) ఇంకా ఈ విధంగా తెలియజేస్తున్నారు: ఆ సమయంలో దైవప్రవక్త (సఅసం) అవిశ్వాసుల కబంధ హస్తాలలో పూర్తిగా చిక్కుకొని ఉన్నారు. వారి బారి నుండి దైవప్రవక్త (సఅసం)ను కాపాడటానికి మాలో ఎవరికీ ధైర్యం చాల్లేదు. అయితే హ్రజత్ అబూబకర్ (రజి) తన ప్రాణాలను సైతం లెక్కచేయకుండా అవిశ్వాసుల వలయాన్ని ఛేదించి దైవప్రవక్త (సఅసం)ను వారి కబంధ హస్తాల నుండి విడిపించారు. పైగా ఆ దుర్మార్గుల్ని మందలిస్తూ, "దౌర్భాగ్యులారా! తన ప్రభువు అల్లాహ్ అన్నంత మాత్రానికే మీరు మీ శ్రేయస్సు కోరుతున్న మనిషిని చంపడానికి సిద్ధమయ్యారా?" అన్నారు.

# వలస కాంక్ష

మక్కాలో ముస్లింలపై సత్యతిరస్కారుల దౌర్జన్యాలు రోజురోజుకు మితిమీరిపోసాగాయి. వారు ముస్లింలను హింసించడానికి కొత్త కొత్త పద్ధతులు అవలంబిస్తున్నారు. దాంతో ముస్లింల జీవితాలు మరింత దుర్భరం అయ్యాయి. అలాంటి పరిస్థితుల్లో హ్రజత్ అబూబకర్ (రజి) గత్యంతరంలేక మక్కా వదలి మదీనాకు వలసపోవడానికి నిర్ణయించుకున్నారు. దాని కోసం సన్నాహాలు కూడా ప్రారంభించారు. ఈ సంగతి తెలిసి దైవప్రవక్త (సఅసం) ఆయన్ని పిలిపించి అడిగారు.

దానికి హ|జత్ అబూబకర్ (రజి), "దైవప్రవక్తా! నా తల్లితండ్రులు మీ కోసం సమర్పితులవుగాక! అవిశ్వాసుల ఆగడాలు రోజురోజుకు ఎలా హద్దు మీరిపోతున్నాయో మీరు చూస్తూనే ఉన్నారు. అందువల్ల నేను మదీనా వెళ్ళి పోవాలనుకుంటున్నాను" అని చెప్పారు

దైవప్రవక్త (సఅసం) ఆయనకు ధైర్యం చెబుతూ, "అబూబకర్! తొందర పడకు. దేవుడు త్వరలోనే నాక్కూడా వలసపోవడానికి అనుమతిచ్చే అవకాశం ఉంది. అప్పటిదాకా కాస్త ఓపిక పట్టు" అన్నారు.

హ|జత్ అబూబకర్ (రజి) ఈ మాట విని సంతోషంతో పొంగిపోయారు. వలస (హి|జత్)లో కూడా తనకు ప్రియప్రవక్త (సఅసం) తోడు లభిస్తోంది. ఈ భావనతో హ|జత్ అబూబకర్ (రజి) పరమానందంతో వలస సమయం కోసం ఎదురుచూడసాగారు.

## హత్యా పథకం

ముస్లింలు ఒక్కొక్కరే మక్కా నుండి వెళ్ళిపోతూ ఉండటాన్ని ఖురైష్ నాయకులు గమనించారు. ఇలా అందరూ వెళ్ళిపోయిన తర్వాత ముహమ్మద్ (సఅసం) కూడా వెళ్ళిపోయే అవకాశం ఉంది. ఆయన మదీనా వెళ్ళిపోతే అక్కడి జనం కూడా ముస్లింలుగా మారిపోవచ్చు. అప్పుడు ముస్లింల బలం బాగా పెరిగిపోతుంది.

ఈ ఆలోచనతో ఖురైష్ నాయకులు తమ కొంపలు మునిగిపోతున్నట్లు తీవ్ర ఆందోళన చెందారు. వెంటనే వారు సమావేశమయి సంప్రదింపులు జరుపుకున్నారు. చివరికి వారు దైవప్రవక్త (సఅసం)ను శాశ్వతంగా కడతేర్చాలని నిర్ణయించుకున్నారు. హత్య చేయువలసిన రోజు కూడా నిర్ణయం అయింది. ఆ రోజు రాత్రి చీకటి పడగానే దైవప్రవక్త (సఅసం) ఇంటిని చుట్టు ముట్టి ఉండాలని, తెల్లవారుజామున నమాజు కోసం బయటికి రాగానే అందరూ కలసి ఒక్క పెట్టున దాడిచేయాలని పథకం వేసుకున్నారు.

## వలస ఆదేశం

అవిశ్వాసులు దైవప్రవక్త (సఅసం)ను అంతమొందించడానికి ఏ రోజు నయితే నిర్ణయించుకున్నారో అదే రోజు దేవుడు తన ప్రవక్త (సఅసం)కు మక్కా నుండి మదీనాకు వలసపోవాలని ఆదేశించాడు.

అప్పుడు దైవప్రవక్త (సఅసం) నేరుగా హజ్రత్ అబూబకర్ (రజి) ఇంటికి వెళ్ళారు. ఆయనకు దేవుని ఆజ్ఞ వినిపించారు. హజ్రత్ అబూబకర్ (రజి) ఎంతో ఆత్రంతో, "మరి మీ వెంట బయలుదేరడానికి నాక్కూడా అనుమతి ఉందా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సఅసం), "తప్పకుండా. ప్రయాణానికి సిద్ధంగా ఉండు" అన్నారు.

ప్రియప్రవక్త (సఅసం) నోట ఈ మాట వినగానే హజ్రత్ అబూబకర్ (రజి) క్షణంపాటు సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయ్యారు. కఠినమైన ఈ సుదీర్ఘ ప్రయాణంలో ప్రియప్రవక్త (సఅసం)కు సేవ చేసే భాగ్యం లభిస్తుంది. ఈ ఆలోచనతో హజ్రత్ అబూబకర్ (రజి) ఆయన(సఅసం) వెళ్ళిపోగానే ఎంతో సంబర పడుతూ ప్రయాణ సామగ్రి సిద్ధం చేసుకోవడం మొదలెట్టారు.

## మదీనాకు వలస (హిజ్రత్)

అది రాత్రివేళ. మక్కాలోని వీరాధివీరులు దైవప్రవక్త (సఅసం) ఇంటిని చుట్టుముట్టి కాపలా కాయసాగారు. దైవప్రవక్త (సఅసం) ఇవేమీ పట్టించుకోకుండా ఇంట్లో ప్రశాంతంగా నిద్రపోతున్నారు. నడిరేయి దాటింది. దైవప్రవక్త (సఅసం) మెల్లిగా ఇంట్లో నుంచి బయటికి అడుగు పెట్టారు. బయట కాపలా కాస్తున్న వీరాధివీరులు నిద్రమత్తుతో జోగుతున్నారు. ఇలా దేవుడు తన ప్రవక్త (సఅసం)ను వారి కళ్ళకు కన్పించకుండా చేశాడు.

దైవప్రవక్త (సఅసం) సరాసరి హజ్రత్ అబూబకర్ (రజి) ఇంటికి వెళ్ళి తలుపు తట్టారు. ఎప్పుడా అని ఎదురుచూస్తున్న హజ్రత్ అబూబకర్ (రజి) వెంటనే తలుపు తీసి ఆయన్ని లోపలికి ఆహ్వానించారు. తరువాత ఆయన కొడుకు అబ్దుల్లా (రజి)కు, కూతురు హజ్రత్ అస్మా (రజి)కు, సేవకుడు ఆమిర్ బిన్ ఫుహైరా(రజి)కు కొన్ని సూచనలు చేసి దైవప్రవక్త (సఅసం)తో కలిసి వెళ్ళారు. మక్కా సమీపంలో ఒక కొండ ఉంది. అందులో సౌర్ అనే ఒక గుహ ఉంది. ఆ గుహ దగ్గరకు చేరుకున్నారు ఇద్దరూ. ముందుగా హజ్రత్ అబూబకర్ (రజి) గుహలోకి ప్రవేశించి దాన్ని రాళ్ళు, ముళ్ళూ లేకుండా శుభ్రపరిచారు. అక్కడక్కడ కన్నాలుంటే వాటిని గుడ్డ పేలికలు పెట్టి మూసేశారు. ఆ తరువాత దైవప్రవక్త (సఅసం)ను లోపలికి తీసికెళ్ళారు.

## కన్నంలో నుంచి పాము బయటికొచ్చింది

దైవప్రవక్త (సఅసం) ప్రతి విషయంలోనూ దాని పర్యవసానం గురించి ఆలోచించకుండా దేవుని మీద భారం వేస్తారు. దేవుడు ఏది చేసినా అందులో దాసుని శ్రేయస్సే ఉంటుందని ఆయనకు బాగా తెలుసు. అందుకే ఆయన మనస్సు ఎల్లప్పుడూ ప్రశాంతంగా, నింపాదిగా ఉంటుంది. గుహలోకి చేరుకున్న తరువాత కాస్త మనస్సు కుదుటపడగానే ఆయనకు నిద్ర వచ్చేసింది. ఆయన (సఅసం) హజ్రత్ అబూబకర్ (రజి) తొడ మీద తల పెట్టి నిద్ర పోయారు.

కాస్సేపు గడిచిందో లేదో ఓ కన్నంలో నుంచి ఒక పాము బయటికి రావడానికి తొంగిచూడసాగింది. దాన్ని చూడగానే హజ్రత్ అబూబకర్ (రజి)కు ముచ్చెమటలు పట్టాయి. ఈ పాము బయటికి వచ్చి ప్రియప్రవక్త (సఅసం)ను ఎక్కడ కాటు వేస్తుందోనని ఆయన భయపడ్డారు. ఒకవేళ లేపితే ఆయనకు నిద్రాభంగం కలుగుతుంది. అది మంచి పని కాదు. ఈ ఆలోచనతో హజ్రత్ అబూబకర్ (రజి) పాము తొంగిచూస్తున్న కన్నానికి పాదం అడ్డం పెట్టి దాన్ని మూసేశారు. అయితే పాము ఆయన పాదానికి కాటు వేసింది. దాంతో హజ్రత్ అబూబకర్ (రజి) ఎంతో బాధపడ్డారు. ఆయన కళ్ళలో నుంచి కన్నీళ్లు కార సాగాయి. యాదృచ్ఛికంగా ఒకటి రెండు కన్నీటి చుక్కలు ప్రియప్రవక్త (సఅసం) ముఖపద్మం మీద పడ్డాయి. దాంతో ఆయన కళ్ళు తెరిచి ఏమిటీ విషయం అని అడిగారు. హజ్రత్ అబూబకర్ (రజి) విషయం చెప్పారు. అప్పుడు దైవ ప్రవక్త (సఅసం) కన్నం దగ్గర్నుంచి కాలు తీసేయమన్నారు. కాలు తీసేయగానే పాము బయటికి వచ్చి వెళ్ళిపోయింది. దైవప్రవక్త (సఅసం) తన నోటి లాలా జలం తీసి హజ్రత్ అబూబకర్ (రజి) పాదానికి రాశారు. పాము కాటు వల్ల కలిగిన బాధ వెంటనే తగ్గిపోయింది.

## భయపడకు, దేవుడు మనకు తోడున్నాడు

అటు మక్కాలో అవిశ్వాసులు దైవప్రవక్త (సఅసం)ను వెతికి పట్టు కోవడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. వారు అనుమానం ఉన్న ప్రతిచోటా గాలిస్తూ తిరగసాగారు. ఒక గుంపు అలా గాలిస్తూ సౌర్ గుహ దగ్గరకు చేరుకుంది. వారు దాదాపు గుహ సమీపానికి వచ్చి నిలబడ్డారు. హజ్రత్ అబూ

బకర్(రజి) గుహలో నుంచి వారి కాళ్లను చూసి తీవ్ర ఆందోళన చెందసాగారు. ఆయన ఆందోళన తన ప్రాణం గురించి కాదు, ప్రియప్రవక్త (సఅసం) ప్రాణం గురించి. ఈ దుర్మార్గులు గనక మరి కొంత ముందుకొచ్చి వంగిచూస్తే, ఇంకేమయినా ఉందా? ఈ ఆలోచనతోనే హజ్రత్ అబూబకర్ (రజి) భయంతో వణికిపోసాగారు.

దైవప్రవక్త (సఅసం) ఆయన పరిస్థితి చూసి, "భయపడకు, దేవుడు మనకు తోడున్నాడు" అని ధైర్యం చెప్పారు. ఈ మాట విన్న తరువాత హజ్రత్ అబూబకర్ (రజి)కు ధైర్యం వచ్చింది. గుహ బయట అవిశ్వాసులు ఓసారి చుట్టూ కలియజూసి అక్కడ్నుంచి వెళ్ళిపోయారు.

## సౌర్ గుహలో మూడు రోజులు

హజ్రత్ అబూబకర్ (రజి) ప్రియప్రవక్త (సఅసం)తో పాటు సౌర్ గుహలో మూడు రోజులు ఉన్నారు.

ఈ మూడు రోజులు ఆయన కుమార్తె హజ్రత్ అస్మా (రజి), సేవకుడు హజ్రత్ ఆమిర్ (రజి) మేకల మందను తోలుకుంటూ సౌర్ గుహ దగ్గరకు వచ్చేవారు. గుహలో ఉన్న దైవప్రవక్త (సఅసం)కు, హజ్రత్ అబూబకర్ (రజి)కు మేక పాలు, ఇంటి దగ్గర్నుంచి తీసుకొచ్చిన భోజనం, నీళ్ళు ఇచ్చి వెళ్ళేవారు. వెళ్ళేటప్పుడు మేకల మందను కూడా తోలుకుపోయేవారు. ఈ విధంగా వాళ్ళిద్దరి అడుగుజాడలు మేకల మంద కాళ్ళ క్రింద చెరిగిపోయేవి. శత్రువులకు గుహ దగ్గరకు ఎవరైనా వచ్చారా అన్న అనుమానం కూడా కలిగేది కాదు.

హజ్రత్ అబూబకర్ (రజి) కుమారుడు హజ్రత్ అబ్దుల్లా (రజి) పగలంతా మక్కాలో తిరిగి, జనంలో కలసిపోయి వారి ఆలోచనలు, నిర్ణయాలు ఏమిటో తెలుసుకునేవారు. సాయంత్రం తిరిగొచ్చి సమాచారం అందజేసేవారు. ఇలా ఆయన కూడా మూడు రోజుల దాకా తన వంతు బాధ్యత నిర్వహించారు.

## సుదీర్ఘ పయనం

నాల్గవ రోజు ప్రియప్రవక్త (సఅసం) మదీనా బయలుదేరాలని చెప్పారు. అప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి) తన కొడుకు, కూతురు, సేవకు

లకు ప్రయాణ సామగ్రి, ఒంటెలు తీసుకురమ్మని చెప్పారు. వాళ్ళు ముగ్గురూ నగరానికి పోయి ప్రయాణ సామగ్రి తెచ్చారు. ఒంటెలు కూడా వచ్చాయి. అంతా సిద్ధం చేసుకొని దైవప్రవక్త (సఅసం), హజ్రత్ అబూబకర్ (రజి), సేవకుడు ఆమిర్ (రజి) వేరే దారి గుండా మదీనాకు బయలుదేరారు. దారి చూపడానికి అబ్ద్ బిన్ అరీఖత్ అనే నమ్మకస్తుడైన ఒక ముస్లిమేతరుడ్ని కూడా వెంట తీసికెళ్ళారు.

హజ్రత్ అబూబకర్ (రజి) ప్రయాణంలో పనికొస్తాడని తన సేవకుడ్ని ఒంటె మీద వెనుక కూర్చోబెట్టుకున్నారు. ఈ విధంగా ఈ ప్రయాణ బృందంలో ఇద్దరికి బదులు నలుగురయ్యారు.

దారిలో ఒక తెలిసిన మనిషి కలిశాడు. అతను హజ్రత్ అబూబకర్ (రజి)తో దైవప్రవక్త (సఅసం) వైపు చూపిస్తూ, "అబూబకర్! నీతో పాటున్న ఈ కొత్త మనిషి ఎవరు?" అని అన్నాడు. కాని హజ్రత్ అబూబకర్ (రజి) అసలు విషయం బయటపెట్టకుండా, "ఈయన మన మార్గదర్శి" అని చెప్పారు. ఆయన ఎలాంటి సమాధానం ఇచ్చారో చూశారా? ఇందులో ఆయన అబద్ధమూ చెప్పలేదు; దైవప్రవక్త (సఅసం) పేరూ బయటపెట్టలేదు.

ఈ విధంగా ఈ బాటసారులు అనేక చోట్ల ఆగుతూ, ప్రయాణ బడలిక తీర్చుకుంటూ, శత్రువుల కంటపడకుండా ఎంతో రహస్యంగా ప్రయాణం చేస్తున్నారు. ఈ సుదీర్ఘ ప్రయాణంలో అనేక రోజులు గడచిపోయాయి.

## మదీనా చేరుకున్నారు

చివరికి ఈ బాటసారుల బృందం ముహమ్మద్ (సఅసం)కు దైవదౌత్యం లభించిన 14వ సంవత్సరంలో, రబీవుల్ అవ్వల్ నెల 12వ తేదీన సురక్షితంగా మదీనా సమీపానికి చేరుకుంది. తీవ్రంగా ఎదురుచూస్తున్న అన్సార్ ముస్లింలు ప్రియప్రవక్త (సఅసం)ను చూడగానే పట్టరాని సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయ్యారు. అందరూ ఖుబా గ్రామం చేరుకున్నారు. అక్కడ హజ్రత్ అబూబకర్ (రజి) దైవప్రవక్త (సఅసం)తో పాటు కొన్నాళ్ళు గడిపారు. ఆ తరువాత మదీనా చేరుకున్నారు. ప్రియప్రవక్త (సఅసం) హజ్రత్ అబూ అయ్యూబ్ (రజి) ఇంట్లో విడిది చేశారు. హజ్రత్ అబూ బకర్ (రజి) హజ్రత్ ఖారిజా బిన్ జైద్ బిన్ అబీ జుహైర్ ఇంట్లో విడిది చేశారు. తరువాత ప్రియ

ప్రవక్త (సఅసం) చేసిన సోదరీకరణలో ఆయనే హజ్రత్ అబూబకర్ (రజి)కు సోదరులయ్యారు.

## మదీనా వాతావరణం

కొంతకాలానికి హజ్రత్ అబూబకర్ (రజి) భార్యాపిల్లలు కూడా హజ్రత్ తల్హా (రజి) వెంట మదీనా చేరుకున్నారు. కాని మదీనా వాతావరణం వారికి అనుకూలించలేదు. హజ్రత్ అబూబకర్ (రజి), ఆయన చిన్న కూతురు హజ్రత్ ఆయిషా (రజి) తీవ్రంగా జబ్బుపడ్డారు. హజ్రత్ ఆయిషా (రజి) వివాహం ప్రియ ప్రవక్త (సఅసం)తో మక్కాలో ఉన్నప్పుడే జరిగింది. ప్రియప్రవక్త (సఅసం) మదీనా వాతావరణం గురించి దైవాన్ని ప్రార్థించారు. దేవుడు ఆయన ప్రార్థన స్వీకరించాడు. మదీనా వాతావరణం మెరుగుపడింది. జబ్బుపడ్డ వారంతా తొందరలోనే కోలుకొని పూర్తిగ ఆరోగ్యవంతులయ్యారు.

## ప్రవక్త మసీదు (మస్జిదె నబవి)

ఇప్పుడు వివిధ ప్రాంతాల్లో ఉన్న ముస్లింలు మదీనా చేరుకోసాగారు. అందువల్ల దైవప్రవక్త (సఅసం) మొట్టమొదట ఒక మసీదు నిర్మించాలని నిర్ణయించారు. హజ్రత్ అయ్యూబ్ (రజి) గారి ఇంటి సమీపంలోనే ఒక ఖాళీ స్థలం ఉంది. అది ఇద్దరు అనాథ బాలుర స్థలం. దైవప్రవక్త (సఅసం) ఆ స్థలాన్ని కొన్నారు. అనాథ బాలుర సంరక్షకుడు స్థలాన్ని ఉచితంగా ఇవ్వడానికి ముందుకొస్తే దైవప్రవక్త (సఅసం) అందుకు అంగీకరించలేదు. దాన్ని పైకం చెల్లించే తీసుకున్నారు. ఈ పైకం హజ్రత్ అబూబకర్ (రజి) చెల్లించారు. ఇప్పుడు ఆయన చేతిలో చిల్లిగవ్వ కూడా లేకుండాపోయింది. ఆయన ఆస్తి అంతా సత్కార్యాలలో హరించుకుపోయింది. మక్కాలో ఉన్నప్పుడే బానిసలను కొని వారికి స్వేచ్ఛ కలిగించడానికి ఎక్కువ డబ్బు ఖర్చయిపోయింది. అయిదు వేలు మాత్రమే మిగిలాయి. ఆ అయిదు వేలు కూడా ఇప్పుడు మసీదు స్థలం కొనడానికి ఖర్చయిపోయాయి.

మసీదు నిర్మాణం తొందరలోనే పూర్తయిపోయింది. హజ్రత్ అబూ బకర్ (రజి) మసీదు నిర్మాణంలో కూడా పాల్గొన్నారు.

## బదర్ యుద్ధం

ముస్లింలు మక్కాలో స్వేచ్ఛగా ఏక దైవారాధన చేయలేకపోవడం వల్లనే మక్కా వదలిపెట్టవలసి వచ్చింది. ఆరాధన సంగతి అలా ఉంచి, అల్లాహ్ పేరును కూడా ఉచ్చరించడం వారికి కష్టమయిపోయింది. వారిని అవిశ్వాసులు ఎల్లప్పుడూ ఏదో ఒక విధంగా వేధిస్తూనే ఉండేవారు. ఇప్పుడు ముస్లింలు మదీనా వస్తే ఇక్కడా వారిని ప్రశాంతంగా ఉండనివ్వడం లేదు.

ముస్లింలు మదీనా వలసవచ్చి ఒక సంవత్సరం గడిచిందో లేదో, మక్కా నుండి వేయి మంది అవిశ్వాసులు మదీనాపై దాడి చేయడానికి వచ్చారు. వారందరి దగ్గర కావలసిన యుద్ధ సామగ్రి అంతా ఉంది. అటు ముస్లింలలో 313 మంది మాత్రమే సమరయోధులు ఉన్నారు. అదీగాక వారి దగ్గర యుద్ధ సామగ్రి కూడా సరిపడినంత లేదు. కాని వారి దగ్గర దృఢమైన విశ్వాస బలం ఉంది. బదర్ అనే ఓ కొండ ప్రాంతంలో ఉభయ పక్షాల మధ్య సంకుల సమరం జరిగింది. ముస్లింలకు విజయం లభించింది. అవిశ్వాసులు చిత్తుగా ఓడిపోయి పలాయనం చిత్తగించారు. డెబ్బయి మంది అవిశ్వాసులు యుద్ధరంగంలో హతమయ్యారు. మరో డెబ్బయి మంది ఖైదీలుగా పట్టుబడ్డారు. హజ్రత్ అబూబకర్ (రజి) కూడా ఈ యుద్ధంలో పాల్గొన్నారు. ఆయన ఒక వైపు ప్రియప్రవక్త (సఅసం)ను కాపాడుతూనే శత్రువులతో వీరోచితంగా పోరాడారు.

యుద్ధ ఖైదీల సమస్య వచ్చినప్పుడు అందరూ తమ తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. హజ్రత్ అబూబకర్ (రజి) ఎంతో దయార్ద్ర హృదయులు. అందుచేత ఆయన తన అభిప్రాయం వ్యక్తపరుస్తూ, "వీరంతా మన బంధువులే. వారి పట్ల దయ, సానుభూతులతో వ్యవహరించాలి. నష్టపరిహారం తీసుకొని విడుదలచేస్తే బాగుంటుంది" అని చెప్పారు. దైవప్రవక్త (సఅసం)కు ఈ సలహా బాగా నచ్చింది. దాని ప్రకారమే ఆయన నష్టపరిహారం తీసుకొని ఖైదీలను విడుదల చేశారు.

## ఇతర యుద్ధాలు

బదర్ యుద్ధం తరువాత కూడా సత్యతిరస్కారులు ముస్లింలను ప్రశాంతంగా ఉండనివ్వలేదు. వారు దాదాపు ప్రతి సంవత్సరం మదీనాపై దాడి

చేయడానికి ప్రయత్నించేవారు. ముస్లింలు వారి దాడులను తిప్పికొట్టే వారు. అవిశ్వాసులు అప్పుడు పారిపోయేవారు. కాని ఇతర తెగల ప్రేరణతో వారు మళ్ళీ యుద్ధసన్నాహాలు చేసేవారు. అందుచేత ఆ తెగలపై కూడా దాడులు చేసి వాటి పీచాన్ని అణచివేయాలని దైవప్రవక్త (సఅసం) సంకల్పించారు. ఈ కారణంగా అనేక యుద్ధాలు చేయవలసి వచ్చింది. ప్రతి యుద్ధంలోనూ ముస్లింలకే విజయం చేకూరేది. హజ్రత్ అబూబకర్ (రజి) ఆ యుద్ధాలన్నింటిలో పాల్గొని తన ప్రతిభా పరాక్రమాలు ప్రదర్శించారు. ఆయన ధర్మ వ్యాప్తి కోసం తన ప్రాణాలు సయితం ఖాతరుచేయకుండా శత్రువులతో పోరాడారు.

## హుదైబియా ఒప్పందం

హిజ్రీ శకం ఆరవ యేట దైవప్రవక్త (సఅసం) కాబా గృహాన్ని దర్శించుకుందామన్న తన అభిప్రాయం వెలిబుచ్చారు. హజ్రత్ అబూబకర్ (రజి) ఈ మాట విని, "మనం కాబా దర్శనం కోసం వెళ్ళాలనుకుంటున్నాం, యుద్ధం చేయడానికి కాదు కదా! అందువల్ల తప్పకుండా వెళ్దాం" అన్నారు. ఈ విధంగా దైవప్రవక్త (సఅసం) 1400 మంది అనుచరులతో బయలుదేరారు.

ముస్లిం యాత్రికులు మక్కా సమీపంలోని హుదైబియా ప్రాంతానికి చేరుకున్నారు. కాని అక్కడ్నుంచి ముందుకు సాగనీయకుండా అవిశ్వాసులు వారిని అడ్డుకున్నారు. అప్పుడు మన ప్రియప్రవక్త (సఅసం) అవిశ్వాసులతో యుద్ధం చేయడానికి బదులు వారితో శాంతి ఒప్పందం చేసుకోవాలని తలచారు. ఈ విధంగా ఉభయపక్షాల మధ్య రాజీ ఒప్పందం కుదిరింది. దీన్ని "హుదైబియా ఒప్పందం" అంటారు. ఈ ఒప్పందంలోని షరతులు పైకి ముస్లింల ప్రయోజనాలకు చాలా వ్యతిరేకమైనవిగా కన్పించాయి. అందుచేత కొందరు అనుచరులకు ఈ ఒప్పందం నచ్చలేదు. "మనం అవిశ్వాసులకు అంతగా లొంగిపోవాల్సిన అవసరం ఏమిటీ?" అంటూ వారు లోలోన ఎంతో బాధపడ్డారు. ముఖ్యంగా హజ్రత్ ఉమర్ (రజి) తీవ్ర ఆందోళన వెలిబుచ్చారు. అలాంటి పరిస్థితిలో హజ్రత్ అబూబకర్ (రజి) ఎంతో సంయమనం పాటిస్తూ, "మహనీయ ముహమ్మద్ (సఅసం) దేవుని ప్రవక్త. ఆయన ఏ పని చేసినా దేవుని అభీష్టానికి వ్యతిరేకంగా చేయరు. ఈ ఒప్పందం కూడా అంతే" అన్నారు. ఈ మాట విని అందరూ సంతృప్తిచెందారు.

## మక్కా విజయం

ఖురైషీయులు హుదైబియా ఒప్పందంలోని షరతులు పాటించలేక పోయారు. వారసలు షరతులను బాహాటంగా ఉల్లంఘించారు. అందువల్ల దైవప్రవక్త (సఅసం) మక్కాను జయించడానికి సన్నాహాలు ప్రారంభించారు. హిజ్రీ శకం 8వ సంవత్సరం పదివేల మంది అనుచరులతో మక్కా బయలు దేరారు. మక్కా ప్రజలకు ఈ సంగతి తెలియదు. ముస్లిం సైన్యం మక్కాకు అతి సమీపంగా వచ్చిన తరువాతే తెలిసింది. దాంతో వారు తీవ్రంగా భయ పడి ఏమీ చేయలేక మౌనంగా ఉండిపోయారు. వారిలో పదమూడేళ్ళదాకా దైవప్రవక్త (సఅసం)ను, ఆయన అనుచరులను అనేక విధాల హింసించిన అగ్రనాయకులు కూడా ఉన్నారు. వారు దైవప్రవక్త (సఅసం)ను వేధించడమే గాకుండా, ఆయన్ని హతమార్చడానికి దుష్టపన్నాగాలు కూడా పన్నారు. అలాంటివారు కూడా ఈ రోజు ముస్లిం సైన్యాన్ని చూసి వణికిపోతున్నారు. కాని దైవప్రవక్త (సఅసం) విశ్వకారుణ్యమూర్తిగా ప్రభవించిన మహనీయులు. ఆయన ఏ ఒక్కరి నుండీ ప్రతీకారం తీర్చుకోకుండా అందరినీ క్షమించారు.

హజ్రత్ అబూబకర్ (రజి) మక్కాలోనే ఉన్న తన తండ్రి అబూ ఖహాఫా దగ్గరికి పరుగెత్తారు. యోగక్షేమాలు అడిగిన తరువాత ఆయన ఇస్లాం వైపు మొగ్గు చూపుతున్నట్లు తెలుసుకున్నారు. వెంటనే ఆయన ఇస్లాం స్వీకారం కోసం తండ్రిని దైవప్రవక్త (సఅసం) సన్నిధికి తీసికెళ్ళారు. దైవప్రవక్త (సఅసం) అతడ్ని ఎంతో గౌరవించారు. తరువాత అతని చేత కలిమా (సద్వచనం) పఠింప జేసి ముస్లింగా మార్చారు.

నాన్నగారు ఇస్లాం స్వీకరించడంతో హజ్రత్ అబూబకర్ (రజి) సంతోషంతో పరవశించిపోయారు. కుటుంబంలో నాన్నగారు, ఒక కొడుకు అబ్దుర్రహ్మాన్ మాత్రమే ఇస్లాం స్వీకరించకుండా ఉండిపోయారు. ఇప్పుడు వాళ్ళిద్దరు కూడా ఇస్లాం స్వీకరించారు. ఈ విధంగా హజ్రత్ అబూబకర్ (రజి) కుటుంబ సభ్యు లంతా ముస్లింలయిపోయారు.

## ఆయనతో ఎవరూ పోటీ పడలేరు

హిజ్రీ శకం తొమ్మిదో సంవత్సరం దైవప్రవక్త (సఅసం) తబూక్ యుద్ధం కోసం సన్నాహాలు ప్రారంభించారు. అది రోమన్లతో జరగబోతున్న యుద్ధం.

అందువల్ల ఆయన భారీయెత్తున విరాళాల కోసం ఒక ప్రకటన చేశారు. హజ్రత్ ఉమర్ (రజి) ఈ ప్రకటన విని ఎంతో సంతోషించారు. ఆ సమయంలో ఆయన దగ్గర చాలా డబ్బు ఉంది. అందుచేత ఈసారి ఎలాగైనా ఈ పవిత్ర కార్యంలో హజ్రత్ అబూబకర్ (రజి)ని మించిపోవాలని నిర్ణయించుకున్నారు.

హజ్రత్ ఉమర్ (రజి) తన దగ్గరున్న మొత్తం సంపదలో సగం కుటుంబ సభ్యుల కోసం వదలి మిగతా సగం తీసుకొని దైవప్రవక్త (సఅసం) సన్నిధికి వెళ్ళారు. దైవప్రవక్త (సఅసం) ఆయన్ని చూసి, "ఉమర్! విరాళం ఎంత తెచ్చావు?" అని అడిగారు. దానికి హజ్రత్ ఉమర్ (రజి), "మొత్తం సంపదలో సగం కుటుంబానికి వదలి, సగం విరాళం ఇవ్వడానికి తెచ్చాను" అన్నారు.

అంతలో హజ్రత్ అబూబకర్ (రజి) వచ్చారు. ఆయన ఇంట్లో ఉన్న దంతా ఊడ్చుకొని మరీ తీసుకొచ్చారు. దైవప్రవక్త (సఅసం) ఆయన్ని కూడా అలాగే ప్రశ్నించారు విరాళం ఎంత తెచ్చావని. దానికి ఆయన ఇంట్లో ఉన్న దంతా తెచ్చానన్నారు. "మరి భార్యాపిల్లల కోసం ఏం వదలిపెట్టావు?" అంటూ మళ్ళీ ప్రశ్నించారు. "వారి కోసం దేవుడ్ని, దైవప్రవక్తను వదలిపెట్టి వచ్చాను" అన్నారు హజ్రత్ అబూబకర్ (రజి). హజ్రత్ ఉమర్ (రజి) ఈ సమాధానం విని "అబూబకర్! నేను నీతో ఎన్నటికీ పోటీ పడలేను" అన్నారు.

## ఇమామత్ (నాయకత్వం)

హిజ్రీ శకం తొమ్మిదో సంవత్సరం ముస్లింలు హజ్ యాత్ర కోసం మక్కా బయలుదేరారు. దైవప్రవక్త (సఅసం) కొన్ని అనివార్య కారణాల వల్ల హజ్‌కు వెళ్ళలేక యాత్రికులకు సారథ్యం వహించడానికి హజ్రత్ అబూబకర్ (రజి)ని నియమించారు.

ఆ తర్వాత హిజ్రీ శకం పదవ ఏట దైవప్రవక్త (సఅసం) హజ్ యాత్రకు వెళ్ళినప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి) కూడా ఆయనతో పాటు వెళ్ళారు. హజ్ నుండి తిరిగొచ్చిన కొన్నాళ్ళకు దైవప్రవక్త (సఅసం) జబ్బుపడ్డారు. చివరికి ఆయన నమాజు చేయించలేనంత వ్యాధిగ్రస్తులైపోవడం వల్ల తన స్థానంలో హజ్రత్ అబూబకర్ (రజి)ని మసీదులో ఇమామ్‌గా నియమించారు. ఒకసారి ఆయన కూడా హజ్రత్ అబూబకర్ (రజి)తో కలసి నమాజు చేశారు.

ఆ నమాజు తర్వాత దైవప్రవక్త (సఅసం) మాట్లాడుతూ, "నేను అందరి ఉపకారాలకు బదులు తీర్చాను. కాని అబూబకర్ చేసిన ఉపకారానికి మాత్రం బదులు తీర్చలేకపోయాను. ప్రళయదినాన దేవుడు దాని ప్రతిఫలం ఇతనికి ప్రసాదిస్తాడు. దైవసాక్షిగా చెబుతున్నాను. నాకు అబూబకర్ (రజి) సంపద వల్ల చేకూరినంత ప్రయోజనం మరెవరి సంపద వల్ల కూడా చేకూరలేదు.

## ఆయన (రజి) విజ్ఞతా వివేచనలు

ఆ తరువాత హిజ్రీ శకం 11 రబీవుల్ అవ్వల్ 12 వ తేదీన మన ప్రియ ప్రవక్త (సఅసం) ఇహలోకం నుంచి శాశ్వతంగా నిష్క్రమించారు. ఈ విషాద సంఘటన ఆయన ప్రియ అనుచరులను దుఃఖ సముద్రంలో ముంచి వేసింది. కొందరు ఈ వార్తను ఓ పట్టాన నమ్మలేకపోయారు.

హ|జత్ అబూబకర్ (రజి) మసీదుకు చేరుకొని లోపల చూస్తే హ|జత్ ఉమర్ (రజి) చేతిలో వరలేని ఖడ్గం తీసుకొని, "ఒకవేళ దైవప్రవక్త (సఅసం) ఇహలోకం వీడిపోయారని ఎవరైనా అంటే నేనతని తల నరికేస్తాను" అంటూ చెబుతున్నారు. హ|జత్ అబూబకర్ (రజి) ఆయనకు నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. కాని ఆయన ఆ సమయంలో ఎవరినీ ఖాతరుచేసే పరిస్థితిలో లేరు. చివరికి హ|జత్ అబూబకర్ (రజి) ఒకచోట నిలబడి ఉప న్యాసం ఇవ్వడం ప్రారంభించారు. ఆ సందర్భంలో ఆయన, "ముహమ్మద్ (సఅసం)ని ఎవరైతే ఆరాధిస్తున్నారో వారు ముహమ్మద్ (సఅసం) చనిపోయారని తెలుసు కోవాలి. అలాగే అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించేవారు అల్లాహ్ సజీవంగా ఉన్నాడని, నిత్యజీవుడని, ఆయనకు మరణం అనేదే ఉండదని తెలుసు కోవాలి" అని అన్నారు. తరువాత ఆయన ఖుర్‌ఆన్‌లోని ఈ ఆయత్ పఠించారు:

**"ముహమ్మద్ దైవప్రవక్త మాత్రమే. ఇతనికి పూర్వం కూడా అనేక మంది దైవప్రవక్తలు వచ్చిపోయారు. మరి ఇతనిప్పుడు చనిపోతే లేక చంప బడితే మీరు (ధర్మపథం నుండి) వెనుదిరిగి పోతారా? గుర్తుంచుకోండి, అలా వెనక్కి పోయేవాడు దేవునికి ఎలాంటి నష్టం కలిగించలేడు." (3:144)**

హజ్రత్ అబూబకర్ (రజి) చేసిన ప్రసంగం, ఈ ఖుర్‌ఆన్ సూక్తి వినగానే అందరూ వాస్తవం తెలుసుకొని మౌనంగా ఉండిపోయారు. హజ్రత్ ఉమర్ (రజి) కూడా కరవాలాన్ని వరలోకి నెట్టి శాంతించారు. ఆ క్లిష్ట సమయంలో హజ్రత్ అబూబకర్ (రజి) మనసులో గనక దేవుడు ఈ విషయాన్ని వేయక పోయివుంటే ఎంత ప్రమాదం వచ్చిపడేదో చెప్పలేం.

## ఖలీఫాగా ఎంపిక

దైవప్రవక్త (సఅసం) శాశ్వతంగా కన్నుమూయగానే ఆయన వారసుడి గురించి జనంలో చర్చ మొదలయింది. వీలైనంత త్వరగా ప్రవక్త వారసుణ్ని నియమించి ఈ సమస్యను పరిష్కరించాలని మేధావులు భావించారు. చివరికి వారు క్షుణ్ణంగా ఆలోచించి హజ్రత్ అబూబకర్ (రజి)ని ప్రవక్త వారసుడిగా, అంటే మొదటి ఖలీఫాగా ఎంపిక చేశారు. మేధావులు ఎంతగానో నచ్చజెప్పిన తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) ఈ బాధ్యతను స్వీకరించారు.

మరుసటి రోజు ఆయన మసీదులో ఉపన్యాసమిస్తూ ఇలా అన్నారు:

"సోదరులారా! నేను మీకు ఖలీఫాగా నియమించబడ్డాను. నిజానికి నేను ఈ పదవికి ఏ విధంగానూ అర్హుణ్ని కాను. అయితే మీరు నన్ను ఖలీఫాగా ఎన్నుకున్నారు గనక, నేను దేవుడు ఆదేశించినట్లు, ఆయన ప్రవక్త (సఅసం) పాలనచేసి చూపిన విధంగానే ప్రభుత్వం నడపడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. నేను గనక సరైన దారిలో నడుస్తుంటే మీరు నా మాటలు ఒప్పుకోవాలి. అలా చేయకపోతే మీరు నా ఆజ్ఞలు పాటించకూడదు. పైపెచ్చు మీరు నన్ను సరైన దారిలో పెట్టాలి. గుర్తుంచుకోండి! ఏ జాతి దైవమార్గంలో పోరాటం జరపడాన్ని మానేస్తుందో, ఆ జాతిని దేవుడు అవమానంపాలు జేస్తాడు. ఏ జాతిలో చెడులు వ్యాపిస్తాయో ఆ జాతిని దేవుడు అష్టకష్టాలకు గురిచేస్తాడు. దేవుడు మనందర్నీ కరుణించుగాక!"

## వ్యాపారం వదలిన ఖలీఫా

హజ్రత్ అబూబకర్ (రజి) ఖలీఫా అయిన తరువాత కూడా యథా ప్రకారం ఒకరోజు వ్యాపార సామగ్రి తీసుకొని బజారుకు బయలుదేరారు. దారిలో హజ్రత్ ఉమర్ (రజి) ఎదురయ్యారు. ఆయన విషయం గ్రహించి,

“మీ మీద ఎంతో బాధ్యతా భారం పడింది. ఇప్పుడు వ్యాపారం, రాజ్యపాలన రెండూ నిర్వహించడం సాధ్యం కాదు” అన్నారు. దానికి హ(జత్ అబూబకర్ (రజి), “మరి భార్యాపిల్లల్ని ఎలా పోషించాలి?” అన్నారు.

హ(జత్ ఉమర్ (రజి) ఈ మాట విని, “దాని ఏర్పాటు చేద్దాం ఉండండి” అంటూ వెళ్ళిపోయారు. ఆయన తోటి మిత్రులతో సంప్రదించారు. హ(జత్ అబూబకర్ (రజి) ఖిలాఫత్ బాధ్యతలను ప్రశాంతంగా నిర్వహించడానికి వీలుగా ఆయనకు వార్షిక వేతనం నిర్ణయించాలని తీర్మానించారు. ఈ నిర్ణయాన్ని హ(జత్ అబూబకర్ (రజి)కు తెలియజేశారు. అందుకు ఆయన అంగీకరించారు. ఆ రోజు నుండి ఆయన వ్యాపారం చేయడం మానేశారు.

## మొట్టమొదటి పని

అరేబియా, సిరియా సరిహద్దుల్లో క్రైస్తవ పాలకులు అలజడులు రేపుతున్నారు. దైవప్రవక్త (సఅసం) తమ జీవితకాలంలోనే వారిని అణచడానికి ఒక సైన్యాన్ని తయారుచేశారు. దానికి పదిహేనేండ్ల యువకుడు హ(జత్ ఉసామా బిన్ జైద్ (రజి)ని సైన్యాధ్యక్షుడిగా కూడా నియమించారు. కాని సైన్యాన్ని యుద్ధరంగానికి పంపక ముందే దైవప్రవక్త (సఅసం) ఇహలోకం వీడిపోయారు. అందుచేత అప్పట్లో సైన్యం వెళ్ళలేకపోయింది. ఇప్పుడు హ(జత్ అబూబకర్ (రజి) ఖలీఫా కాగానే మొట్టమొదట సైన్యాన్ని సిద్ధం చేసుకో వలసిందిగా హ(జత్ ఉసామా (రజి)ని ఆదేశించారు.

అయితే దేశ అంతర్గత పరిస్థితులు బాగా లేనందున అప్పుడే ఈ సైన్యాన్ని సిరియా సరిహద్దులకు పంపవద్దని అనుచరులు చెప్పారు. కాని హ(జత్ అబూబకర్ (రజి) వారి సలహాను త్రోసిపుచ్చుతూ, “దైవప్రవక్త (సఅసం) పంపడానికి నిర్ణయించిన సైన్యాన్ని నిరోధించడానికి నేనెవర్ని?” అన్నారు. అనుచరులు మరో సలహా ఇస్తూ, “అయితే ఉసామా (రజి) అనుభవంలేని నవయువకుడు. అందుచేత మీరు అనుభవజ్ఞుడయిన మరొకడ్ని సైన్యా ధ్యక్షుడిగా నియమించి పంపడి” అని చెప్పారు. హ(జత్ అబూబకర్ (రజి) దాన్ని కూడా త్రోసిపుచ్చుతూ, “ఉసామా (రజి)ను స్వయంగా దైవప్రవక్తే

(సఅసం) సైన్యాధ్యక్షుడిగా నియమించారు. దైవప్రవక్త (సఅసం) చేసిన నియామకాన్ని నేను రద్దు చేయలేను" అని అన్నారు.

చివరికి ఈ సైన్యం హ|జత్ ఉసామా బిన్ జైద్ (రజి) నాయకత్వంలో బయలుదేరింది. నలభై రోజులపాటు యుద్ధం చేసిన తరువాత విజయం సాధించి తిరిగొచ్చింది. ఈ విజయంతో ఇస్లామీయ రాజ్యం చుట్టుపక్కల జరుగుతున్న అలజడులు సద్దుమణిగాయి. శత్రువులు ముస్లింలకు భయపడి తోకలు ముడిచారు.

## పసిడి పలుకులు

హ|జత్ ఉసామా (రజి) నాయకత్వంలో సైన్యాన్ని పంపడానికి ముందు హ|జత్ అబూబకర్ (రజి) సైనికులను సంబోధిస్తూ ఇలా ప్రసంగించారు: "సోదరులారా! నేను మీకు పది మాటలు ఉపదేశిస్తున్నాను. వీటిని మీరు తు.చ. తప్పకుండా పాటించాలి. వినండి:

1. నిజాయితీగా వ్యవహరించండి.
2. చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోండి.
3. దొంగతనానికి పాల్పడకండి.
4. యుద్ధంలో హతులయినవారి అవయవాలను కోసెయ్యకండి. స్త్రీలను, పిల్లలను, వృద్ధులను చంపకండి.
5. ఖర్జూరపు చెట్లను నరకడంగాని, కాల్చివేయడంగాని చేయకండి.
6. ఇతర పండ్ల చెట్లను కూడా నరకవద్దు.
7. మేకలు, గొఱ్ఱెలు, ఆవులు, ఒంటెలను తినడానికి తప్ప చంపకండి.
8. చర్చిలలో ఉండి ఆరాధనల్లో నిమగ్నులై ఉండేవారి జోలికి పోకండి.
9. మీకెవరైనా భోజనం పెడ్తే మీరు దేవుని పేరు ఉచ్చరించి తినండి.
10. మీకు తారసపడేవారిలో తల మధ్య భాగం గొరిగించుకొని తల అంచుల్లో పొడుగాటి శిరోజాలు వదిలేవారు కూడా ఉంటారు. వారిని మీరు హతమార్చివేయాలి.

## అసత్య ప్రవక్తలు

మన ప్రియప్రవక్త (సఅసం) ఇహలోకం వీడిపోగానే అనేకమంది తాము కూడా దైవప్రవక్తలయినట్లు ప్రకటించుకున్నారు. ఈ అసత్య ప్రవక్తలు అరేబియాలోని విభిన్న ప్రాంతాలలో పుట్టుకొచ్చారు. ప్రజలలో అనేకమంది క్రమంగా వారి మాయమాటలు విని వారికి శిష్యులైపోయారు. హ|జత్ అబూ బకర్ (రజి) ఆ విద్రోహుల వైపు కూడా తక్షణమే దృష్టి సారించారు. హ|జత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి), మరికొందరి నాయకత్వంలో సైనిక దళాలను పంపించడం జరిగింది. భీకర యుద్ధాలు జరిగాయి. ఈ యుద్ధాలలో ఇద్దరు అసత్య ప్రవక్తలు హతమయ్యారు. వారిద్దరిలో ఒక స్త్రీ కూడా ఉంది. వారి అనుచరులు పలాయనం చిత్తగించారు.

## వీరే అసత్య ప్రవక్తలు

**(1) అస్వద్ అనసి:** మన ప్రియప్రవక్త (సఅసం) జీవిత కాలంలోనే ఇతను తాను దైవప్రవక్తనని ప్రకటించుకున్నాడు. ఇతను యమన్ నివాసి. తన తెగకు నాయకుడు కూడా. ప్రియప్రవక్త (సఅసం) అతడ్ని శిక్షించడానికి హ|జత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) నాయకత్వంలో ఒక సైనిక దళాన్ని పంపించారు. ప్రియప్రవక్త (సఅసం) పరలోక నిష్క్రమణకు రెండు రోజుల ముందే ఈ అసత్య ప్రవక్త హతమార్చబడ్డాడు.

**(2) ముసైలిమా కజ్జాబ్:** ఇతను బనీ హనీఫా తెగకు చెందినవాడు. ప్రియ ప్రవక్త (సఅసం) జీవిత అంత్యకాలంలో ఇతను దైవప్రవక్తనని ప్రకటించు కున్నాడు. అనేక మంది అనేక విధాలా నచ్చజెప్పినా వినకుండా అతను సత్యవ్యతిరేక కార్యకలాపాలు సాగించాడు. చివరికి హ|జత్ అబూబకర్ (రజి) ఖలీఫా అయిన తరువాత అతడ్ని శిక్షించడానికి సైన్యాన్ని పంపించారు. యమామా అనే చోట భీకర యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అతను హత మయ్యాడు. ఇటు ముస్లిం యోధులలో కూడా అనేకమంది అమరగతు లయ్యారు. వారిలో డెబ్భయి మంది ఖుర్ఆన్ హాఫిజ్‌లు ఉన్నారు.

**(3) తలీహా బిన్ ఖువైలద్ అసది:** ఇతను నజద్ ప్రాంతంలో ఉండే బనీ అసద్ తెగకు నాయకుడు. దైవప్రవక్త (సఅసం) దివంగతులయ్యారని వినగానే ఇతను కూడా తాను దైవప్రవక్తనని ప్రకటించుకున్నాడు. హజ్రత్ ఖాలిద్ (రజి) నాయకత్వంలో ఒక సైనిక దళం అతడి పీచమణచడానికి వెళ్ళింది. ఈ యుద్ధంలో అతను చిత్తుగా ఓడి సిరియా పారిపోయాడు. అయితే ఆ తరువాత కొన్నాళ్ళకు అతను పశ్చాత్తాపం చెంది తిరిగి ముస్లిం అయ్యాడు. హజ్రత్ ఉమర్ (రజి) పాలనా కాలంలో అతను ముస్లింల వైపు ఉండి అనేక యుద్ధాలలో పాల్గొన్నాడు.

**(4) నజాహ్ బిన్త్ హారిసా:** ఈమె తమీమ్ తెగకు చెందిన స్త్రీ. ఈమె కూడా దైవప్రవక్తనని ప్రకటించుకుంది. తగిన బలం సంపాదించడానికి అసత్యప్రవక్త ముసైలిమా కజ్జాబ్‌ని వివాహం చేసుకుంది. అయితే ఆ తరువాత ఆమె పశ్చాత్తాపం చెంది హజ్రత్ అమీర్ మావియా (రజి) పాలనా కాలంలో ముస్లిం అయిపోయింది.

## మార్గభ్రష్టులైపోయినవారు

అనేకమంది అరబ్ నాయకులు చిత్తశుద్ధితో ఇస్లాం స్వీకరించలేదు. ప్రదర్శనా బుద్ధితో మాత్రమే ఇస్లాం స్వీకరించినట్లు ప్రకటించారు. అందువల్ల దైవప్రవక్త (సఅసం) ఇహలోకం వీడిపోగానే వారు అలజడులు సృష్టించడం ప్రారంభించారు. అలాంటివారిలో బహ్రైన్‌లో నోమాన్ బిన్ మున్జిర్ అనేవాడు, అమ్మాన్‌లో లఖీత్ బిన్ మాలిక్ అనేవాడు ముఖ్యులు. కందా ప్రాంతంలో అనేక మంది తమనుతాము రాజులమని ప్రకటించుకున్నారు. అదీగాక వారు ఇస్లాంతో కూడా తమ సంబంధాలు తెంచుకున్నారు. ఇదెంతో ప్రమాదకరమైన విషయం. వారి విద్రోహ చర్యలు మితిమీరిపోవడంతో హజ్రత్ అబూబకర్ (రజి) అసత్య ప్రవక్తలను అణచివేయగానే ఇలా బిన్ హజ్రమీ (రజి)ని బహ్రైన్ ప్రాంతానికి, హుజైఫా బిన్ ముహ్‌సిన్ (రజి)ని అమ్మాన్ ప్రాంతానికి, జియాద్ బిన్ లబీద్ (రజి)ని కందా ప్రాంతానికి సైన్యాలను ఇచ్చి పంపారు. ఈ సైన్యాలు విద్రోహుల పీచం పూర్తిగా అణచివేశాయి. ఈ విధంగా ఇస్లామి రాజ్యంలో అలజడులు తగ్గిపోయి శాంతి భద్రతలు నెలకొన్నాయి.

## జకాత్ చెల్లింపు నిరాకరణ

ఆ రోజుల్లోనే కొందరు ముస్లింలు ప్రభుత్వానికి జకాత్ చెల్లించడానికి నిరాకరించారు. జకాత్ దేవుడు నిర్ణయించిన విధి; పేదవాళ్ళ ఆర్థిక హక్కు. అలాంటి విధిని నిరాకరించడం అంటే ప్రభుత్వ ఆజ్ఞను ధిక్కరించడమే. అందుచేత హజ్రత్ అబూబకర్ (రజి) అటువైపు కూడా దృష్టి సారించారు. ముందుగా వారికి నచ్చజెప్పి చూశారు. కాని వారు మాటలతో దారికి వచ్చే సూచనలు కన్పించకపోవడంతో ఆయన వారిపై యుద్ధం ప్రకటించారు.

వారు ఈ యుద్ధ ప్రకటన విని భయపడలేదు. పైగా ప్రస్తుత పరిస్థితిలో ప్రభుత్వానికి తమను ఎదుర్కొనేంత శక్తి లేదని భావించారు. అయితే హజ్రత్ అబూబకర్ (రజి) సైన్యాన్ని సమీకరించి యుద్ధానికి పంపగానే వారు వణికి పోయారు. ఒకటి రెండు చోట్ల మాత్రమే దాడులు జరిగాయి. తిరుగుబాటు దారులు ప్రభుత్వ సైనికుల ధాటికి నిలువలేక పలాయనం చిత్తగించారు.

ఈ విధంగా దాదాపు ఒక సంవత్సరంపాటు నిరంతరాయంగా జరిగిన కృషి ఫలితంగా ఇక ఇస్లామి ప్రభుత్వాన్ని ఎవరూ ఎదిరించలేరని అందరూ భావించారు. రాజ్యంలో తిరుగుబాటు ధోరణులు పూర్తిగా అంతమయ్యాయి. సర్వత్రా శాంతి భద్రతలు నెలకొన్నాయి.

## దివ్యఖుర్ఆన్ కూర్పు

గత ఒక సంవత్సరంలో జరిగిన వివిధ యుద్ధాల్లో ఖుర్ఆన్‌ని కంఠస్థం చేసిన అనేకమంది హాఫిజ్‌లు అమరగతులైపోయారు. ముఖ్యంగా అసత్య ప్రవక్త ముసైలిమా కజ్జాబ్‌ను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు డెబ్బయి మంది హాఫిజ్‌లు అమరగతులయ్యారు. హజ్రత్ ఉమర్ (రజి) ఇది గమనించి తీవ్ర ఆందోళన చెందారు. ఈ విధంగా ఖుర్ఆన్ హాఫిజ్‌లు అమరగతులైపోతుంటే దురదృష్టవశాత్తు ఖుర్ఆన్‌లో కొంతభాగం వ్యర్థమైపోతుందేమోనని ఆయన భయపడ్డారు. అందుచేత ఆయన హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరికెళ్ళి ఖుర్ఆన్‌కు చెందిన వివిధ భాగాలను ఒకచోట చేర్చి సమగ్ర గ్రంథంగా

రూపొందించవలసిన అవసరాన్ని గురించి చెప్పారు. హజ్రత్ అబూబకర్ (రజి) అంగీకరించి ఆ పనిని హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి)కు అప్పగించారు. ఖుర్‌ఆన్ ఆయత్‌ల, సూరాల క్రమాన్ని దైవప్రవక్త (సఅసం) దేవుని అభీష్టం ప్రకారం ఇదివరకే రూపొందించి ఉన్నారు. ఇప్పుడు రాతి పలకలు, చర్మపు ముక్కలు, ఖర్జూర మట్టలు, ఎముకలపై వ్రాయబడిన ఖుర్‌ఆన్ భాగాలను చేర్చి ఒక గ్రంథంగా వ్రాయవలసి ఉంది. ఆ పనిని హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి) ఎంతో కష్టపడి పూర్తిచేశారు.

ఇది హజ్రత్ అబూబకర్ (రజి) పాలనా కాలంలో నిర్వహించబడిన ఒక ఘనకార్యంగా భావించబడుతోంది. ఆ తరువాత కాలంలో ఇలా రూపొందిన సమగ్ర గ్రంథానికి నకళ్ళు తీయించి సర్వసామాన్యం చేశారు.

## దేశం వెలుపలి అలజడులు

హజ్రత్ అబూబకర్ (రజి) ఖలీఫా కాగానే ఆయనకు అనేక సమస్యలు ఎదురయ్యాయి. ఒక వైపు అసత్య ప్రవక్తలు లేచారు. మరొక వైపు మన స్ఫూర్తిగా ముస్లింలు కానివారు ప్రభుత్వానికి జకాత్ చెల్లించడానికి నిరాకరించారు. ఇవన్నీ దేశం వెలుపలున్న అగ్రశక్తుల అండదండలతో సాగుతున్నాయి. వారిలో ఈరానీయులు, క్రైస్తవులు ముఖ్యులు. వారి రాజ్య సరిహద్దులు అరేబియాతో కలసి ఉన్నాయి. అందువల్ల వారికి అరేబియాలో అలజడులు సృష్టించడానికి అవకాశం లభించింది. వీరంతా ఇస్లాంకు బద్ధ శత్రువులయ్యారు. అరేబియాలో కొత్తగా ఇస్లామి రాజ్యం ఏర్పడి అతి వేగంగా విస్తరిస్తూ పోతుండటంతో వారు తమ ఉనికికే ప్రమాదం ముంచు కొస్తోందని భయపడ్డారు. అందుకే వారు ఇస్లామీయ రాజ్యంలో కల్లోలాలు సృష్టిస్తున్నారు.

అయితే ముస్లింలకు దేవుని సహాయం ఉంది. ఈ కారణంగా ఇస్లాం వ్యతిరేక శక్తులు ప్రతి చోటా ఎదురుదెబ్బలే తిన్నారు. ఇస్లామి రాజ్యంలో వారి ఏజెంట్లు అందరూ నామరూపాల్లేకుండా తుడిచిపెట్టుకుపోయారు. అందుచేత హజ్రత్ అబూబకర్ (రజి) ఇప్పుడు విదేశీ దుష్టశక్తుల వైపు దృష్టి సారించారు. వారి పీచం అణచడానికి పథకాలు వేయడం మొదలెట్టారు.

## ఈరాన్ మీద దాడులు

హ|జత్ అబూబకర్ (రజి) ఏ పని తలపెట్టినా సహచరులతో సంప్రదించకుండా చేసేవారు కాదు. ఇప్పుడు ఈరానీలు, రోమన్ల విషయంలో కూడా సహచరులతో సంప్రదించారు. సహచరులంతా వారిపై దాడి చేయాలని సలహా ఇచ్చారు.

హ|జత్ అబూబకర్ (రజి) మొదట హ|జత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) నాయకత్వంలో ఒక పెద్ద సైన్యాన్ని ఇచ్చి ఈరాన్‌కు పంపించారు. హ|జత్ ఖాలిద్ (రజి) దైవకరవాలం అన్న బిరుదు ద్వారా ప్రియప్రవక్త (సఅసం) చేత మెప్పు పొందిన గొప్ప సమరయోధుడు. అందుచేత ఆయన ఈరాన్‌లో ప్రవేశించి దాడులు నిర్వహించగానే ఈరానీలు ప్రతి చోటా చిత్తుచిత్తుగా ఓడిపోసాగారు. ఆయన ఎటు పోయినా విజయపతాకం ఎగరేసిగాని తిరిగొచ్చేవారు కాదు. ఈ కారణంగా ఈరానీలు ఆయన పేరు వింటేనే భయపడసాగారు. ఈ విధంగా హ|జత్ ఖాలిద్ (రజి)- హీరా, అంబార్, అయినుత్తమరా, దూమతుల్ జందల్, ఫరాజ్ మొదలైన అనేక ప్రాంతాలు జయించారు. అవన్నీ ఇప్పుడు ఇస్లామి రాజ్యం అధీనంలోకి వచ్చాయి. దాంతో ఈరాన్ సామ్రాజ్య పునాదులు కదలి పోయాయి.

## సిరియాపై దాడులు

రోమ్ రాజ్యం కూడా ఇస్లామి సామ్రాజ్యాన్ని అంతమొందించడానికి కుట్రలు పన్నసాగింది. ఈరాన్ విజయంతో ముస్లింలకు కొండంత ధైర్యం వచ్చింది. హ|జత్ అబూబకర్ (రజి) ఈ అవకాశాన్ని జారవిడవకుండా రోమ్ రాజ్యంపై దాడులు నిర్వహించడానికి సన్నాహాలు ప్రారంభించారు. రోమ్ సామ్రాజ్యం అంతర్భాగమయిన సిరియాపై నలువైపుల నుంచి దాడులు జరపడానికి ఆయన పథకం రూపొందించారు. హ|జత్ అబూ ఉబైదా (రజి), హ|జత్ యజీద్ బిన్ అబూసుఫైన్ (రజి), హ|జత్ షుర్జీల్ బిన్ హసనా (రజి), హ|జత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) వంటి అనుభవజ్ఞులైనవారి నేతృత్వంలో సైనిక దళాలను ఇచ్చి పంపారు. రోమ్ సైన్యం కూడా యుద్ధానికి సిద్ధమయింది. సైనిక సంఖ్యలో రోమన్లు ముస్లింల కంటే అత్యధిక సంఖ్యలో ఉన్నప్పటికీ

రణరంగంలో వారు ముస్లింల ధాటికి నిలువలేకపోయారు. కొన్నాళ్ళకు హజ్రత్ ఖాలిద్ (రజి) కూడా ఈరాన్‌లో కొన్ని ప్రాంతాలు జయించిన తరువాత సిరియాలో పోరాడుతున్న ముజాహిద్‌ల దగ్గరకు చేరుకున్నారు. ఆయన రాకతో రోమ్ సైనికుల గుండెల్లో గుబ్బులు పరుగెత్తాయి.

చూస్తుండగానే బస్రా, ఫహల్, అజ్నాదీన్ ప్రాంతాలు ముస్లింల స్వాధీన మయ్యాయి. ముస్లిం యెూధులు మరింత ముందుకు పురోగమించి డెమాస్కస్‌ని చుట్టుముట్టారు. యుద్ధం మొదలయిందో లేదో అటు మదీనా నుండి హజ్రత్ అబూబకర్ (రజి) చనిపోయారన్న విషాద వార్త వచ్చింది. దాంతో యుద్ధం కాస్తంత మందకొడిగా సాగింది.

## వ్యాధిగ్రస్తులయ్యారు

అది హిజ్రీ శకం 13వ సంవత్సరం, చలికాలం, జమాదిల్ ఆఖిర్ నెల ఏడవ తేది. హజ్రత్ అబూబకర్ (రజి) స్నానం చేశారు. స్నానం చేసిన కాస్సేపటికే ఆయనకు జ్వరం వచ్చింది. ఆ జ్వరం తగ్గకపోగా రోజురోజుకు ఎక్కువయి పోసాగింది. దాంతో ఆయన చాలా బలహీనులయ్యారు. నడవడం కూడా కష్టమయిపోయింది. అప్పుడాయన హజ్రత్ ఉమర్ (రజి)ని పిలిచి, "మసీదులో అయిదు వేళలా నమాజు చేయించండి" అని చెప్పారు. జబ్బు ముదిరిపోతూనే ఉంది. సహచరులు మంచి వైద్యుడ్ని పిలిపించారా అని అడిగితే, "నా వైద్యుడు (దేవుడు) నన్ను చూస్తూనే ఉన్నాడు. నాకు తృప్తిగానే ఉంది" అని సమాధానమిచ్చారు ఆయన.

చివరికి ఒక రోజు తనకు మరణకాలం సమీపించిందని గ్రహించగానే ఆయన తన ప్రియ సహచరులను పిలిచి, తన స్థానంలో ఖలీఫాగా హజ్రత్ ఉమర్ (రజి) పేరును ప్రతిపాదించారు. సహచరులందరూ ఈ ప్రతిపాదనను అంగీకరించారు.

ఆ తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) మదీనా ప్రజలను సమావేశ పరచి, "నా అంత్యకాలం సమీపించింది. నేను నా స్థానంలో ఖలీఫాగా నా బంధువుల్లో ఎవరినీ ఎంపిక చేయలేదు. మీలో అందరికంటే ఎక్కువ శ్రేష్ఠుడైన ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)ని ఎంపిక చేశాను. మరి మీకు ఈ ఎంపిక ఇష్టమేనా?" అని అడిగారు. దానికి ప్రజలంతా తమకు ఇష్టమే అన్నారు ముక్త

కంఠంతో. తరువాత హజ్రత్ ఉమర్ (రజి)ని పిలిపించి ముఖ్యమైన కొన్ని విషయాలు ఉపదేశించారు.

## వీలునామా

ముస్లింలు మరణానికి ముందు తాము వదలిన ఆస్తి వగైరా విషయాలను గురించి తన వారసులకు మంచీ చెడులు తెలియజేయాలి.

హజ్రత్ అబూబకర్ (రజి) కూడా రాజ్యపాలన ఏర్పాటు చేసిన తర్వాత తన కుమార్తె, విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)ను పిలిచారు. తన పక్కన కూర్చోబెట్టుకొని ఎంతో ప్రేమగా ఇలా మాట్లాడారు:

"నా చిట్టి తల్లీ! ఇప్పుడు నా అంత్యకాలం సమీపించింది. నేను వెళ్ళి పోయిన తరువాత నీవు నీ సోదరుల, సోదరీల హక్కులు నెరవేరుస్తూ ఉండాలి. ప్రభుత్వ ధనాగారానికి సంబంధించి నా మీద ఉన్న రుణాన్ని నా తోట అమ్మి తప్పకుండా తీర్చాలి. ఇప్పుడు నా దగ్గరున్న సేవకుడు, రెండు ఒంటెలు, నా దేహం మీదున్న ఈ దుప్పటి ప్రభుత్వానికి చెందిన ఆస్తులు. వీటిని నేను చనిపోగానే ఉమర్ (రజి) దగ్గరకు పంపివేయాలి."

ఈ ఉపదేశం తరువాత ఆయన తన బానిసను పిలిచి, "నేను ఖలీఫా అయిన దగ్గర్నుంచి ఇప్పటివరకు ఎంత జీతం తీసుకున్నానో కాస్త లెక్క కట్టి చెప్పు" అన్నారు. బానిస లెక్కజూసి చెప్పాడు. అప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి), "అయితే ఈ పైకం నా ఇల్లు అమ్మి ప్రభుత్వ ధనాగారంలో జమ చేయించు" అని చెప్పారు.

హజ్రత్ అబూబకర్ (రజి) చనిపోయిన తరువాత ఆయన చెప్పినట్లే చేయడం జరిగింది. ప్రభుత్వ సేవకుడు, ఒంటెలు, దుప్పటి, జీతం డబ్బులు హజ్రత్ ఉమర్ (రజి) దగ్గరకు పంపించారు. ఆయన వాటిని చూసి కన్నీరు మున్నీరుగా రోదించడం ప్రారంభించారు. "అబూబకర్ (రజి) నన్ను పెద్ద పరీక్షకు గురిచేశాడు. ఆయనలా ఎవరు చేయగల్గుతారు?" అన్నారు ఆయన.

## మరణం

హిజ్రీ శకం 13వ సంవత్సరం, జమాదిల్ ఆఖిర్ నెలలో జరిగిన సంఘటన. హజ్రత్ అబూబకర్ (రజి) పడక మీద పడుకొని ఉండే, "ఈ రోజు

ఏం వారం?" అని అడిగారు ముందు కూర్చున్న సహచరులతో. వారు, "ఈ రోజు సోమవారం" అని చెప్పారు. "సరే, దైవప్రవక్త (సఅసం) ఏ రోజు ఇహ లోకం వీడిపోయారు?" అని మళ్ళీ అడిగారు హజ్రత్ అబూబకర్ (రజి). "సోమవారం రోజు" అని చెప్పారు సహచరులు. అప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి) ఆకాశం వైపు చూస్తూ, "నేను కూడా ఈ రోజే ఇహలోకం వీడిపోవాలని అనుకుంటున్నా" అన్నారు. తరువాత కాస్సేపటకి, "దైవప్రవక్త (సఅసం)ను ఎన్ని వస్త్రాలలో కఫన్ (వస్త్ర సంస్కారం) చేశారు?" అని అడిగారు. "మూడు వస్త్రాలలో" అని సమాధానం వచ్చింది. "అయితే రెండు వస్త్రాలు నా దేహం మీద ఉన్నాయి. మరో వస్త్రం కొని తీసుకురావాలి" అన్నారు.

హజ్రత్ ఆయిషా (రజి) ఈ మాటలు విని భోరున విలపించారు. "కాదు, కాదు. మేము మూడూ కొత్త వస్త్రాలే తెప్పిస్తాము" అన్నారు ఆమె ఏడుస్తూనే. దానికి హజ్రత్ అబూబకర్ (రజి) స్పందిస్తూ, "అమ్మా! కొత్త బట్టలు ధరించడానికి బ్రతికున్నవారే ఎక్కువ హక్కుదారులు గాని, చనిపోయినవారు కాదు" అన్నారు.

హజ్రత్ అబూబకర్ (రజి) కోరుకున్నట్లే ఆయన అదే రోజు రాత్రి మగ్రిబ్, ఇషా వేళల మధ్య చనిపోయారు. **(ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్)**

ఆ రాత్రే హజ్రత్ అబూబకర్ (రజి) భౌతిక కాయాన్ని ఖననం చేయడం జరిగింది. ఆయన భార్య హజ్రత్ అస్మా బిన్త్ ఉమైస్ (రజి) ఆయన భౌతిక కాయానికి స్నానం చేయించారు. హజ్రత్ ఉమర్ (రజి) జనాజా నమాజ్ చేయించారు. భౌతిక కాయాన్ని ప్రియప్రవక్త (సఅసం) సమాధికి కుడి వైపున సమాధి చేశారు. చూశారా! హజ్రత్ అబూబకర్ (రజి)కు దైవప్రవక్త (సఅసం) మీద ఎంత ప్రేమాభిమానాలు ఉన్నాయో!! చనిపోయిన తరువాత కూడా ఆయనకు దైవప్రవక్త (సఅసం) దగ్గరే చోటు లభించింది.

## దేవుడు ఆయన కోరిక నెరవేర్చాడు

హజ్రత్ అబూబకర్ (రజి)కు దైవప్రవక్త (సఅసం)పై ఎంత ప్రేమ ఉందో మీరు గత పుటలలో చదివారు. ప్రతి విషయంలోనూ ఆయన దైవ ప్రవక్త (సఅసం)ను అనుకరించాలని, ప్రతి పనీ దైవప్రవక్త (సఅసం) చేసినట్లే

చేయాలని కోరుకునేవారు. తన వయస్సు కూడా దైవప్రవక్త (సఅసం) వయస్సు అంతే ఉండాలని కోరుకున్నారు. దేవుడు ఆయన కోరికను తీర్చాడు.

➢ హజ్రత్ అబూబకర్ (రజి) చనిపోయేనాటికి ఆయన వయస్సు 63 సంవత్సరాలు. దైవప్రవక్త (సఅసం) వయస్సు కూడా అంతే.

➢ హజ్రత్ అబూబకర్ (రజి) సోమవారం రోజు దివంగతులయ్యారు. ప్రియప్రవక్త (సఅసం) కూడా సోమవారం రోజే దివంగతులయ్యారు.

హజ్రత్ అబూబకర్ (రజి) రెండేళ్ళ మూడు నెలలు మాత్రమే ఖలీఫాగా పరిపాలన చేశారు.

## ఆయన (రజి) భార్యలు

హజ్రత్ అబూబకర్ (రజి) నలుగురు స్త్రీలను వివాహమాడారు:

**(1) ఖతీలా బిన్త్ అబ్దుజ్జా**: ఈమె లూయీ తెగకు చెందిన మహిళ. ఇస్లాం స్వీకరణకు పూర్వమే ఈమెను వివాహమాడారు.

**(2) ఉమ్మె రూమాన్ బిన్త్ ఆమిర్**: ఈమె బనీ కనానా వంశానికి చెందిన స్త్రీ. ఈమెను కూడా ఇస్లాం స్వీకరణకు పూర్వమే వివాహమాడారు.

**(3) అస్మా బిన్త్ ఉమైస్ (రజి)**: ఈమె ఖషామ్ వంశానికి చెందిన మహిళ. ముస్లిం అయిన తర్వాత ఈమెను వివాహమాడారు. ఈమె మొదటి వివాహం హజ్రత్ జాఫర్ బిన్ అబూతాలిబ్‌తో అయింది. హజ్రత్ జాఫర్ (రజి) అమర గతులయిన తర్వాత ఆమెను హజ్రత్ అబూబకర్ (రజి) వివాహమాడారు.

**(4) హబీబా బిన్త్ ఖారిజా (రజి)**: ఈమె ఖజ్రజ్ తెగకు చెందిన మహిళ. ఈమెను కూడా ముస్లిం అయిన తర్వాతే వివాహమాడారు.

## సంతానం

(1) మొదటి భార్య ద్వారా హజ్రత్ అబ్దుల్లా (రజి), హజ్రత్ అస్మా (రజి) పుట్టారు.

(అ) అబ్దుల్లా బిన్ అబూబకర్ (రజి): ఈయన ప్రారంభంలోనే ఇస్లాం స్వీక రించారు. తాయిఫ్ యుద్ధంలో దైవప్రవక్త (సఅసం)తో పాటు పాల్గొన్నారు. హజ్రత్ అబూబకర్ (రజి) పాలనా కాలంలోనే ఈయన చనిపోయారు.

(ఇ) అస్మా బిన్త్ అబూబకర్ (రజి):- ఈమె సౌర్ గుహలో దైవప్రవక్త (సఅసం)కు సేవచేశారు. హ|జత్ జుబైర్ బిన్ అవ్వామ్ (రజి)తో ఈమె వివాహం జరిగింది. హ|జత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి)ఈమె కుమారులే. ఆమె వంద సంవత్సరాలు జీవించారు.

(2) రెండవ భార్య ద్వారా హ|జత్ అబ్దుర్రహ్మాన్ (రజి), విశ్వాసుల మాతృమూర్తి హ|జత్ ఆయిషా (రజి) జన్మించారు.

(అ) హ|జత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబకర్ (రజి):- ఈయన చాలా కాలం తర్వాత ఇస్లాం స్వీకరించారు. నాన్నగారి పాలనాకాలంలో అనేక యుద్ధాలలో పాల్గొన్నారు. హి|జీ శకం 53లో చనిపోయారు.

(ఇ) ఆయిషా బిన్త్ అబూబకర్ (రజి):- ఈమె వివాహం దైవప్రవక్త (సఅసం)తో జరిగింది. ఈమె ఎంతో తెలివితేటలు గల మహిళ. హదీసు విద్యలో గొప్ప పండితురాలు. దాదాపు డెబ్బయి సంవత్సరాల వయస్సులో హి|జీ శకం 58లో చనిపోయారు.

(3) మూడవ భార్య ద్వారా హ|జత్ ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి)పుట్టారు. హ|జత్ అలీ (రజి) పాలనాకాలంలో ఈజిప్ట్ గవర్నర్‌గా పనిచేశారు. ఈజిప్ట్‌లోనే చనిపోయారు.

(4) నాల్గవ భార్య ద్వారా ఉమ్మె కుల్సూమ్ (రహ్మాలై) జన్మించారు. ఈమె హ|జత్ అబూబకర్ (రజి) చనిపోయిన తరువాత జన్మించారు.

## రూపురేఖలు, గుణగణాలు

హ|జత్ అబూబకర్ (రజి) తెల్లగా, బక్కపలచగా ఉంటారు. బుగ్గలు సొట్టబోయి ఉంటాయి. కళ్ళు కొంచెం లోపలికి ఉంటాయి. తల మీద ముందు భాగంలో వెంట్రుకలు లేవు. శిరోజాలకు గోరింటాకు పూసుకునేవారు. కొంచెం వంగి నడుస్తారు. వ్రేలికి వెండి ఉంగరం ఉంటుంది.

హ|జత్ అబూబకర్ (రజి) ఉదార స్వభావి. అత్యధిక దానధర్మాలు చేస్తారు. పేదలను అన్ని విధాలా ఆదుకునేవారు. ఎంతో మృదు హృదయులు. దివ్యఖుర్‌ఆన్ పఠిస్తూ దుఃఖించేవారు. అయితే ఆయన ఎంతో ధైర్యశాలి, పరాక్రమవంతుడు కూడా. దైవప్రవక్త (సఅసం)ను ఎంతగానో అభిమానించే

వారు. దేవునికి ఎక్కువగా భయపడుతుండేవారు. ఎంతో భక్తిపరులు. రాత్రి వేళల్లో ఎక్కువగా ఆరాధనలో గడుపుతారు. పగటి వేళల్లో ఉపవాసం పాటిస్తారు. సంఘసేవ కోసం ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండేవారు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆయన దైవప్రవక్త (సఅసం)ను పూర్తిగా అనుకరించడానికి ప్రయత్నించేవారు.

## దైవభీతి పరాయణత

హజ్రత్ అబూబకర్ (రజి) రాత్రివేళల్లో చాలా పొద్దుపోయే వరకూ నమాజ్ చేయడంలో గడిపేవారు. అలాగే పగటి వేళల్లో ఉపవాసం ఉండే వారు. అసలు ఆయన ప్రయత్నంచేయని సత్కార్యమంటూ ఉండేది కాదు. అయినప్పటికీ ఆయన దైవభీతి, పరలోక జవాబుదారీ భావనలతో ఎల్లప్పుడూ వణికిపోతూ కంటతడి పెట్టుకునేవారు.

ఒకసారి ఆయన ఒక తోట పక్కగా వెళుతుంటే చెట్లపై పక్షులు కిచకిచ లాడుతున్నాయి. ఆయన వాటిని చూసి ఇలా అన్నారు: "పక్షులారా! మీరెంత అదృష్టవంతులు! చీకూ చింతా లేకుండా ఎంతో ప్రశాంతంగా కోరుకున్న విధంగా కాయలు తింటున్నారు. ఏ చెట్టు మీద కూర్చోవాలనుకుంటే ఆ చెట్టు మీద కూర్చుంటారు. ప్రళయదినాన మీరు మీ కర్మలకు దేవుని ముందు ఎలాంటి లెక్క చెప్పవలసిన పనిలేదు. అయ్యో! నేను కూడా మీలా ఒక పక్షినయి పుట్టివుంటే ఎంత బాగుండేది!!"

చూశారా! ప్రళయదినాన జరిగే కర్మవిచారణ గురించి తలచుకొని హజ్రత్ అబూబకర్ (రజి) ఎంత భయపడేవారో!

## ధనవ్యయంలో జాగ్రత్తలు

హజ్రత్ అబూబకర్ (రజి) ప్రభుత్వ ధనాగారాన్ని (బైతుల్ మాల్‌ని) ప్రజల సొమ్ముగా భావించేవారు. ఈ భావనతో ఆయన ప్రజా అవసరాల కోసం మాత్రమే ఖర్చుపెట్టేవారు.

ఒక రోజు హజ్రత్ అబూబకర్ (రజి) శ్రీమతి ఆయన కోసం ఏదైనా తీపి పదార్థం వండటానికి తేనె కావాలని అడిగారు. దానికి ఆయన ఏమన్నారో తెలుసా? "నాకొచ్చే జీతం డబ్బుతో తేనె కొనలేమని నీకు తెలుసు కదా! తేనె

వద్దు గీనె వద్దు" అన్నారు ఆయన. దాంతో పాపం శ్రీమతి మారు మాట్లాడకుండా నోరుమూసుకున్నారు.

అయితే ఆమె తన భర్తకు ఎలాగైనా ఓసారి తీపి పదార్థం తినిపించాలన్న పట్టుదలను మాత్రం వదల్లేదు. అందువల్ల ప్రభుత్వం నుండి లభించే కరువు భత్యంలో రోజూ కొంత మిగల్చడం ప్రారంభించారు. చివరికి ఒక రోజు ఆ డబ్బుతో తేనె తెప్పించి తీపి పదార్థం వండారు. ఆ రోజు సాయంత్రం భర్త ఇంటికి రాగానే ఆయన ముందు ఈ తీపి వంటకం ఉంచారు. హ్రజత్ అబూబకర్ (రజి) దాని వైపు ఆశ్చర్యంగా చూస్తూ, "ఈ తీపి పదార్థం ఎక్కడ్నుంచి వచ్చింది?" అని అడిగారు. అప్పుడు ఆయన శ్రీమతి జరిగిన సంగతంతా వివరించారు. హ్రజత్ అబూబకర్ (రజి) ఆ సంగతి విని, "మన రోజువారీ ఖర్చు నుండి నీవు అంత మిగుల్చుతున్నావు. అయినా మనకు ఎలాంటి లోటు రాలేదు. దీన్నిబట్టి నాకు అంత డబ్బు ఎక్కువ లభిస్తోందన్న మాట" అన్నారు. అనడమే కాదు. వెంటనే ఆయన ఆ మేరకు డబ్బు తన జీతం నుండి తగ్గింప జేయించారు.

## అధర్మ సంపాదనకు దూరం

ఒకసారి హ్రజత్ అబూబకర్ (రజి) సేవకుడు ఒక తీపి పదార్థం తెచ్చి తినమని ఆయనకు అందించాడు. ఆయన దాన్ని తిని, "ఇది చాలా రుచిగా ఉంది. ఎక్కడ్నుంచి తెచ్చావు?" అని అడిగారు. దానికి సేవకుడు ఇలా చెప్పాడు: "నేను ఇస్లాం స్వీకరించక పూర్వం ఒకతనికి అతని జాతకం చెప్పాను. నాకు జాతకం చెప్పడం రాకపోయినా వచ్చని చెప్పి అతడ్ని మోసగించాను. ఈ రోజు అతను నా దగ్గరికొచ్చి జాతకం చెప్పినందుకు తీపి పదార్థం ఇచ్చి పోయాడు. మీరిప్పుడు తిన్న తీపివస్తువు అదే."

ఈ మాట వినగానే హ్రజత్ అబూబకర్ (రజి) నొసలు చిట్లించారు. వెంటనే ఆయన అంగిలిలో వేలు పెట్టి కక్కివేశారు. తరువాత "అధర్మ పదార్థంతో పోషించబడిన శరీరం నరకానికి ఆహుతి అవుతుంది" అన్నారు.

చూశారా! హ్రజత్ అబూబకర్ (రజి) అధర్మ వస్తువులకు ఎంత దూరంగా ఉండేవారో!

# నోటి దురుసు పట్ల జాగ్రత్త

నిజమైన విశ్వాసి పొరపాటున తప్ప దైవాగ్రహానికి గురిచేసే ఏ పనీ చేయడు. అలాగే అతను తన నోటికి కూడా కళ్ళెం వేసి బహు జాగ్రత్తగా మాట్లాడుతాడు. ఒకవేళ ఎప్పుడైనా పొరపాటున ఇతరులకు బాధ కలిగించే మాటేదయినా అంటే, ఆ తరువాత క్షమాపణ కోరుకుంటాడు.

ఒకసారి హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ రబియా బిన్ జాఫర్ (రజి)ల మధ్య ఏదో విషయంలో తీవ్రమైన వాగ్వివాదం జరిగింది. హజ్రత్ అబూబకర్ (రజి) ఆ సందర్భంలో హజ్రత్ రబియా (రజి)కు మనస్సు నొప్పించే మాటేదో అన్నారు. అయితే కోపం చల్లారగానే ఆయన, "రబియా! నీవు కూడా నా పట్ల కఠినమైన మాటేదైనా అను" అన్నారు. ఈ మాట చెప్పి ఆయన ఏకధాటిగా ఏడ్వడం ప్రారంభించారు. తరువాత ఈ విషయం దైవప్రవక్త (సఅసం) దృష్టికి వచ్చింది. ఆయన విషయం వివరంగా తెలుసుకొని, "రబియా! నీవు కఠినమైన మాటేదీ అనకు. 'అబూబకర్, దేవుడు నిన్ను క్షమించుగాక' అని మాత్రమే చెప్పు" అన్నారు. హజ్రత్ రబియా (రజి) ఆ మాటే చెప్పారు. అప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి) మనస్సు కుదుటపడింది. ఆయన కన్నీరు ఆగిపోయింది.

చూశారా! హజ్రత్ అబూబకర్ (రజి) దేవునికి ఎంత భయపడేవారో!

# సహచరుల పట్ల సద్వర్తనం

ఒకసారి హజ్రత్ అబూబకర్(రజి), హజ్రత్ ఉమర్ (రజి)ల మధ్య ఏదో విషయమయి వివాదం రేగింది. ఆ సందర్భంలో హజ్రత్ అబూబకర్ (రజి) నోట ఓ కఠోరమైన మాట వెలువడింది. ఆ మాట విని హజ్రత్ ఉమర్ (రజి) ఎంతో బాధపడ్డారు. హజ్రత్ అబూబకర్ (రజి) అది గమనించి చాలా సిగ్గుపడి పోయారు. వెంటనే ఆయన హజ్రత్ ఉమర్ (రజి)కు క్షమాపణ చెప్పుకున్నారు. అయితే హజ్రత్ ఉమర్ (రజి) క్షమించడానికి నిరాకరించారు. దాంతో హజ్రత్ అబూబకర్ (రజి) తీవ్ర ఆందోళన చెందారు. ఆయన నేరుగా దైవప్రవక్త (సఅసం) దగ్గరికి వెళ్ళి జరిగిన విషయం వివరంగా తెలియజేశారు. అప్పుడు దైవప్రవక్త (సఅసం) ఆయన్ని ఓదార్చుతూ, "అబూబకర్! సహనం వహించు, దేవుడు నిన్ను క్షమిస్తాడు" అని మూడు సార్లు చెప్పారు.

అయితే అటు హజ్రత్ ఉమర్ (రజి) తాను క్షమించడానికి నిరాకరించినందుకు పశ్చాత్తాపం చెందసాగారు. ఆయన సరాసరి హజ్రత్ అబూబకర్ (రజి) ఇంటికి పోయారు. కాని అక్కడ ఆయన లేకపోవడంతో దైవప్రవక్త (సఅసం) సన్నిధికి వెళ్ళారు. ఆయన్ని చూడగానే దైవప్రవక్త (సఅసం) ముఖం కోపంతో జేవురించింది. అబూబకర్ (రజి) దైవప్రవక్త (సఅసం) రౌద్రాకారం చూసి భయపడ్డారు. ఆయన దైవప్రవక్త (సఅసం)ను ప్రశంసిస్తూ, "దైవప్రవక్తా! అసలు తప్పంతా నాదే. ఇందులో ఉమర్ (రజి) తప్పేమీ లేదు" అన్నారు.

చూశారా! హజ్రత్ అబూబకర్ (రజి) తన సహచరుల సంక్షేమం కొరకు ఎంత శ్రద్ధ వహించేవారో!!

## నిగర్వి

హజ్రత్ అబూబకర్ (రజి) ఎంతో నిరాడంబర జీవి. ఆయనలో గర్వం అనేది మచ్చుకైనా లేదు. ఎలాంటి పనయినా, ఎంతటి చిన్న పనయినా చేయడానికి ఆయన తటపటాయించేవారు కాదు.

ఆయన ఎక్కడికైనా సైన్యాన్ని పంపేటప్పుడు తన ఖలీఫా పదవిని, వృద్ధాప్యాన్ని కూడా లెక్కచేయకుండా కొంత దూరందాకా సేనాపతితో పాటు కాలినడకన వెళ్ళేవారు. ఒకవేళ సేనాపతి గౌరవభావంతో గుఱ్ఱం దిగడానికి ప్రయత్నిస్తే హజ్రత్ అబూబకర్ (రజి) అతడ్ని వారిస్తూ, "నేను దైవమార్గంలో కొంత దూరం కాలినడకన నడిచి కాళ్ళకు మట్టి పూసుకుంటే వచ్చే నష్టం ఏమిటీ?" అని చెప్పేవారు. దైవప్రవక్త (సఅసం) ఈ విషయాన్ని గురించి చెబుతూ, "దైవమార్గంలో మట్టితో మలినమయ్యే కాళ్ళను నరకాగ్ని కాల్చనీయకుండా దేవుడు దాన్ని నిషేధిస్తాడు" అన్నారు.

## నిరాడంబరత

హజ్రత్ అబూబకర్ (రజి) ఎంతో నిరాడంబరమైన మనిషి. పొగడ్తలు, డాంబికాలు అంటే ఆయనకు గిట్టవు. అహంకారం ఆయనలో ఏ కోశానా లేదు. ప్రజలు ఆయన్ని దైవప్రవక్త (సఅసం) వారసుడన్న భావనతో గౌరవించ

డానికి లేచి నిలబడేవారు. కాని దాని వల్ల హజ్రత్ అబూబకర్ (రజి) నొచ్చుకుంటూ, "జనం నన్ను అనవసరంగా ఆకాశానికి ఎత్తేస్తున్నారు" అనేవారు.

ఒకవేళ ఎవరైనా హజ్రత్ అబూబకర్ (రజి)ని పొగిడితే, దానికి ఆయన దేవుణ్ణి ఇలా ప్రార్థించేవారు: "దేవా! నా పరిస్థితి నా కంటే నీకే ఎక్కువ తెలుసు. నా గురించి వారికంటే నాకే బాగా తెలుసు. దేవా! వారు నన్ను పొగిడినదాని కంటే ఎక్కువ శ్రేష్ఠుడిగా చెయ్యి. నా పాపాలు క్షమించు. ప్రజల అతిశయోక్తుల కారణంగా నీవు నా నుండి బదులు తీర్చుకోకు."

## దైవమార్గంలో ధనవ్యయం

ఇస్లాం స్వీకరించక పూర్వం హజ్రత్ అబూబకర్ (రజి) గొప్ప ధనికులు. అప్పుడు ఆయన దగ్గర నలభైవేల దిర్హంలు ఉండేవి. ఇస్లాం స్వీకరించిన తరువాత వాటన్నిటినీ దైవమార్గంలో ఖర్చుచేశారు. ప్రియప్రవక్త (సఅసం) ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ, "నాకు అబూబకర్ (రజి) ధనం వల్ల చేకూరినంత ప్రయోజనం మరెవరి ధనం వల్ల కూడా చేకూరలేదు" అన్నారు. అదీగాక ఆయన (సఅసం) ఒకసారి, "ధనప్రాణాల దృష్ట్యా నాకు అబూబకర్ (రజి) చేసినంత మేలు మరెవరూ చేయలేదు" అని కూడా అన్నారు.

ఈ మాట వినగానే హజ్రత్ అబూబకర్ (రజి) కళ్ళు చెమర్చాయి. ఆయన ఎంతో వినయవిధేయతలతో, "దైవప్రవక్తా! నా ధనప్రాణాలన్నీ మీ కోసమే" అన్నారు.

## ఇప్పుడు మాకు పాలు ఎవరు పితికిస్తారు?

ప్రియప్రవక్త (సఅసం) పేదలకు, బలహీనులకు ఎలా సహాయపడేవారో, హజ్రత్ అబూబకర్ (రజి) కూడా పేదలకు, బలహీనులకు అలా సహాయ పడేవారు.

మదీనాలో ఒక అనాథ బాలిక ఉండేది. హజ్రత్ అబూబకర్ (రజి) ఖలీఫా కాక పూర్వం ఆయన ఆ బాలిక ఇంటికెళ్ళి ఆమె మేకల పాలు పితికిచ్చేవారు. ఆయన (రజి) ఖలీఫా అయిన తరువాత ఆ పాప ఆందోళన

చెందుతూ తనకిక ఆయన పాలు పితికివ్వరేమో అనుకున్నది. అయినా ఆశతో ఆమె హజ్రత్ అబూ బకర్ (రజి) ఇంటికెళ్ళి, "ఇప్పుడు మీరు ఖలీఫా అయ్యారు. ఇక మాకు మా మేకల నుండి పాలు పితికి ఎవరిస్తారు?" అని అడిగింది.

హజ్రత్ అబూబకర్ (రజి) ఎంతో వాత్సల్యం కనబరుస్తూ, "పాపా! ఖలీఫా అయినంతమాత్రాన ఏమవుతుందీ? అసలు ఖలీఫా ప్రజలకు సేవ చేయడానికే కదా ఉండేది! మీ మేకల పాలు నేనే పితికి ఇస్తుంటాను. ఆందోళన పడకు" అన్నారు. అనాథ బాలిక ఈ మాట విని సంతోషిస్తూ వెళ్ళి పోయింది. హజ్రత్ అబూబకర్ (రజి) యధాప్రకారం ఖలీఫా అయిన తరువాత కూడా ఆ బాలికకు ఆమె మేకల పాలు పితికి ఇస్తుండేవారు.

## కలల గూఢార్థం చెప్పేవారు

హజ్రత్ అబూబకర్ (రజి) కలల గూఢార్థం చెప్పే కళలో ప్రసిద్ధి చెందారు. అప్పుడప్పుడు దైవప్రవక్త (సఅసం) కూడా ఆయన చేత తన కలల గూఢార్థం చెప్పించుకునేవారు.

ఒకసారి దైవప్రవక్త (సఅసం) కొన్ని నల్ల తోడేళ్ళలో అనేక తెల్ల తోడేళ్ళు వచ్చి చేరినట్లు కలగన్నారు. ఈ కల గూఢార్థం ఏమిటో చెప్పమని ఆయన హజ్రత్ అబూబకర్ (రజి)ని అడిగారు. దానికి ఆయన ఇలా సమాధానం ఇచ్చారు: "దైవప్రవక్తా(సఅసం)! నల్ల తోడేళ్ళు అంటే మొదట ఇస్లాం స్వీకరించిన అరబ్బులని అర్థం. తెల్ల తోడేళ్ళు అంటే ఆ తరువాత పెద్ద ఎత్తున ఇస్లాం స్వీకరించనున్న అరబ్బేతరులని అర్థం."

దైవప్రవక్త (సఅసం) దాన్ని ధృవపరుస్తూ, "అబూబకర్ (రజి)! నీవు నిజం చెప్పావు. దైవదూత కూడా ఈ కల గూఢార్థం ఇలాగే చెప్పాడు" అన్నారు.

## ప్రజాసేవ

హజ్రత్ అబూబకర్ (రజి) ఎల్లప్పుడూ ప్రజాసేవ చేసే అవకాశం కోసం ఎదురుచూస్తుండేవారు. ప్రజలకు సేవచేసి ఆయన ఎంతో ఆనందించేవారు.

మదీనా పట్టణం సమీపంలో ఒక ముసలమ్మ ఉండేది. ఆమె గుడ్డిది. అదీగాక ఆమెకు వెనుకా ముందూ ఎవరూ లేరు. అందువల్ల హజ్రత్ ఉమర్ (రజి) ప్రతి రోజూ ఉదయాన్నే ఆమె పూరింటికి వెళ్ళి ఆమె పనులన్నీ చేసేవారు.

అయితే కొన్నాళ్ళ నుంచి వచ్చి చూస్తుంటే తనకు ముందే ఎవరో వచ్చి ఆ పనులన్నీ చేసిపోతున్నట్లు అన్పించింది ఆయనకు. ఆ మనిషి ఎవరో తెలియక హజ్రత్ ఉమర్ (రజి) లోలోన మధనపడసాగారు.

ఒక రోజు హజ్రత్ ఉమర్ (రజి) ఉదయం కాస్త పెందలకడనే వెళ్ళి ఆ ముసలమ్మ ఇంటి చూరు కింద దాగి గమనించడం మొదలెట్టారు. ఆ తర్వాత కాస్సేపటికి ఒకతను వచ్చాడు. అతను ముసలమ్మ ఇంట్లోకి ప్రవేశించి ఆమె పనులన్నీ చేశాడు. పనులన్నీ చేశాక అక్కడ్నుంచి వచ్చినదారే వెళ్ళి పోయాడు. అతడ్ని చూసి హజ్రత్ ఉమర్ (రజి)కు చాలా ఆశ్చర్యం వేసింది. ఆ మనిషి ఎవరో కాదు, సాక్షాత్తు ఖలీఫా హజ్రత్ అబూబకరే (రజి)!

చూశారా! హజ్రత్ అబూబకర్ (రజి) ఖలీఫా అయి ఉండి కూడా ప్రజా సేవ చేయడానికి ఎలా కాచుకొని ఉండేవారో! వీలైనంత పుణ్యం సంపాదించ డానికి ఆయన అనుక్షణం తాపత్రయపడుతుండేవారు.

## అతిథి సత్కారం

హజ్రత్ అబూబకర్ (రజి) అతిథి సత్కారం చేయడంలో కూడా ఎంతో ముందుండేవారు. అతిథుల అవసరాలకు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చేవారు. ఒక రోజు రాత్రి కొందరు పేద ముస్లింలు ఆయన ఇంటికి అతిథులుగా వచ్చారు. వారి రాకకు ముందే హజ్రత్ అబూబకర్ (రజి), "ఎవరైనా అతిథులు వస్తే వారికి భోజనం పెట్టడంతో పాటు బాగా అతిథి మర్యాదలు జరపాలని" తన కొడుకు అబ్దుర్రహ్మాన్ (రజి)కు తాకీదుచేసి వెళ్ళారు.

తండ్రి చెప్పినట్లే హజ్రత్ అబ్దుర్రహ్మాన్ (రజి) ఆ పేద అతిథులు వచ్చిన తరువాత వారికి భోజనం వడ్డించారు. కాని అతిథులు హజ్రత్ అబూబకర్ (రజి) రానంతవరకు తాము భోజనం చేయడం బాగుండదని చెప్పి ఆయన కోసం

ఎదురుచూస్తూ కూర్చున్నారు. అయితే ఆ రోజే హ్రజత్ అబూబకర్ (రజి) యాదృచ్ఛికంగా చాలా పొద్దుపోయి వచ్చారు. అప్పటిదాకా అతిథులు భోజనం చేయలేదని తెలిసి ఆయన కొడుకు మీద మండిపడ్డారు. అప్పుడు అతిథులు కల్పించుకొని, "అతను మాకు చాలా ముందే భోజనం వడ్డించాడు. కాని మేమే మీరు లేకుండా భోజనం చేయడం బాగుండదని తలచి భోజనం చేయలేదు" అని చెప్పారు. అప్పుడుగాని ఆయన శాంతించలేదు.

## ఏ పుణ్యకార్యమూ వదల్లేదు

హ్రజత్ అబూబకర్ (రజి) ఎల్లప్పుడూ పరలోకంలో జరిగే కర్మవిచారణ పట్ల ఎంతో భయపడుతుండేవారు. అందువల్ల ఎప్పుడూ ఏదో ఒక పుణ్యకార్యం చేయాలనే తలంపుతో ఉండేవారు.

ఒక రోజు దైవప్రవక్త (సఅసం) తన అనుచరులతో మాట్లాడుతూ, "ఈ రోజు మీలో ఎవరైనా ఉపవాసం ఉన్నారా?" అని అడిగారు. ఆ తరువాత ఆయన, "ఈ రోజు మీలో ఎవరైనా ఎవరి జనాజా నమాజయినా చేశారా?" అని అడిగారు మళ్ళీ. ఈ రెండు ప్రశ్నలకు ఎవరి నుండీ సమాధానం రాలేదు. చివరికి హ్రజత్ అబూబకర్ (రజి), "దైవప్రవక్తా! నేను ఉపవాసం ఉన్నాను. జనాజా నమాజ్ కూడా చేశాను" అని చెప్పారు.

అదే విధంగా దైవప్రవక్త (సఅసం) మరికొన్ని విషయాలు అడుగుతూ, "ఈ రోజు మీలో ఎవరైనా ఏ పేదవాడికైనా అన్నదానం చేశారా? ఏ రోగినయినా పరామర్శించారా?" అని అడిగారు. వీటికి కూడా అందరూ మౌనం వహించారు. హ్రజత్ అబూబకర్ (రజి) మాత్రమే, "నేను చేశాను, నేను పరామర్శించాను" అని చెప్పారు. అప్పుడు దైవప్రవక్త (సఅసం), "ఒక్క రోజులో ఇన్ని పుణ్య కార్యాలు చేసినవాడు తప్పకుండా స్వర్గానికి పోతాడు" అని చెప్పారు.

దీన్నిబట్టి హ్రజత్ అబూబకర్ (రజి) పుణ్యసంపాదన కోసం అనుక్షణం ఎంతగా తాపత్రయపడేవారో ఊహించండి. దేవుడు మనక్కూడా వీలైనన్ని ఎక్కువ పుణ్యకార్యాలు చేసే సద్బుద్ధి ప్రసాదించుగాక!

# అందరికంటే ముందుండేవారు

హ్రజత్ అబూబకర్ (రజి) ప్రతి పుణ్యకార్యంలోనూ అందరికంటే ముందుండటానికి ప్రయత్నించేవారు. అలాంటివారినే నిజమైన, పరిపూర్ణమైన ముస్లింలని అంటారు.

- హ్రజత్ అబూబకర్ (రజి) పురుషుల్లో అందరికంటే ముందు ఇస్లాం స్వీకరించారు.
- ఆయన (రజి) అందరికన్నా ముందు ఖుర్‌ఆన్‌కు దైవగ్రంథమని పేరు పెట్టారు.
- దైవప్రవక్త (సఅసం) తరువాత ఆయనే అందరికంటే ముందు ఖుర్‌ఆన్‌ని ఒక చోట సమీకరించారు.
- ఆయన అందరికంటే ముందు అవిశ్వాసులతో పోరాడారు.
- ఆయన అందరికంటే ముందు ప్రభుత్వ ధనాగారాన్ని నెలకొల్పారు.
- ప్రవక్త(సఅసం)అనుచరుల్లో అందరికంటే ముందు ఇజ్తెహాద్ (సంస్కరణ) చేశారు.
- శ్రేష్ఠమైన ఖలీఫాలలో ఆయనే మొదటి ఖలీఫా.
- ముహమ్మద్ (సఅసం) అనుచర సముదాయంలో ఆయనే అందరికంటే ముందు స్వర్గంలో ప్రవేశిస్తారు.
- ఇస్లాంలో అందరికంటే ముందు ఆయనకే అతీఖ్ (వివేకవంతుడు) అనే బిరుదు లభించింది.

# ఆయన హితోక్తులు

హ్రజత్ అబూబకర్ (రజి) ఎంతో మంచి హితోక్తులు ఉపదేశించారు. వాటిని మనం జాగ్రత్తగా పరిశీలించి చదవాలి. ఆపై వాటిని ఆచరించడానికి ప్రయత్నించాలి.

- దేవుని ప్రియభక్తులయినవారు తమ సిరిసంపదలన్నిటిని దేవుని మార్గంలో ధారపోయాలి.

- ఇతరులపై నిందారోపణలు చేయకండి, మీకు మనశ్శాంతి లభిస్తుంది.
- చెడ్డ పనులు చేసేవారికి తోడ్పడేవారు కూడా చెడ్డ పనులు చేస్తున్నట్లే.
- సత్కార్యాలు మనిషిని దుష్కార్యాల నుండి కాపాడుతాయి.
- మీ వల్ల ఏవైనా పాపకార్యాలు జరిగివుంటే, వాటికి బదులుగా పుణ్య కార్యాలు చేసి మిమ్మల్ని మీరు దైవశిక్ష నుండి కాపాడుకోండి.
- చెడ్డ స్నేహితులతో కలసి ఉండటంకన్నా మీరు ఒంటరిగా ఉండటమే మంచిది.
- పాపం చీకటి లాంటిది. దాన్ని దైవభీతి మాత్రమే తొలగిస్తుంది.
- పరలోకం కూడా చీకటి లాంటిదే. దాన్ని సదాచరణ అనే వెలుగు పోగొడ్తుంది.
- మనస్సు లగ్నం చేసి చేసే నమాజే అసలైన నమాజ్.
- జ్ఞానం అనేది దైవప్రవక్తల నుండి వారసత్వంలో లభించే సంపద.
- ఆపదను సహనం ద్వారా దూరం చేయవచ్చు.
- ఉదయం పెందలాడ లేవడంలో మీరు పక్షుల వెనుక ఉండిపోవడం ఎంతో సిగ్గుచేటయిన విషయం.
- మీరు గౌరవించబడాలంటే ఇతరులకు అతిథిమర్యాదలు చేయండి.
- పదవీ హోదాల ప్రలోభానికి గురికాకుండా ఉంటే పేరుప్రతిష్ఠలు మీ పాదాలను తాకుతాయి.
- మూడు విషయాలు మనిషికి ప్రాణసంకటంగా మారుతాయి. అవి: (1) అన్యాయం, (2) వాగ్దానభంగం, (3) మోసం.

